శ్రీ శివాభ్యాంనమః

# నలప్రవాసము

## నాటకము



గ్రంథకర్త

మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగశాస్త్రి





పబ్లిషర్సు :

సుందరరాం అండ్ సన్సు, తెనాలి.

# విజ్ఞప్తి

మ. వరకృష్ణాతటినీ తటప్రకట సౌభాగ్యంబు శైలాగ్రభా
స్వరమల్లేశము తాడికొండపుర మస్మద్వాస మా విద్వదా
కరభూతోద్భట దేశికాన్వయజుఁడన్ గావ్యజ్ఞ సేవానుభా
వ్యరసస్ఫీతుఁడ నాగలింగసమభిఖ్యాముఖ్య విఖ్యాతుఁడన్.

శా. భారద్వాజసగోత్రుఁడన్ భవపదాబ్జాతార్చనాతత్పరా
ఘోరారాధ్యసుతుండ మేలిగొనపుంగ్రో వైనజ్వాలాంబికా
శ్రీరత్నామలగర్భశుక్తిభవుఁడన్ స్మేరస్మరారిస్ఫుర
త్కారుణ్యోద్వహ దివ్యవిగ్రహ విదిధ్యాసానిశాభ్యాసుఁడన్.

శా. గుంటూర్మండలిఁ గృష్ణవేణితటినీ కుల్యాప్తి నిస్తుల్యమై
గెంటున్ స్వర్గపురిన్ దెనాలి యచటన్ గీర్వాణవిద్యాలయం
బుంటన్ బోధకవృత్తి నర్తిలుటకై యుత్సాహమే పారుటన్
గంటిన్ గాపుర మాపురిన్ స్వజనవర్గం బందు శోభిల్లుటన్.

చంపకమాలిక

ధరఁ బరమప్రసిద్ధ విబుధప్రవ రాప్పయ దీక్షితేంద్రభా
సురతరవంశవారినిధి సోమనిభుం డగు రాజువిద్వద
ధ్వరివర శిష్యకోటి కవతంస మనం దగు శ్రీనివాస వి
ద్వరగురు సత్కృపాధిగత పాణిని జైమిని బాదరాయణ
ర్షి రచిత తంత్రవార్ధిఁ బరిశీలిత కోమలకావ్యజాలుఁడన్
జిరతర యోగసంహిత వసిష్ఠగురూక్తము దెల్గు సేసితిన్
సరసమనోజ్ఞ బాణకృతి సల్పితి నాంధ్రము శైవశాస్త్రసం
భరితరహస్యముల్ వెలయఁ బత్రిక వైచితిఁ జాలకాలమున్
బరగెడు బ్రహ్మసూత్రముల భాష్యము లెల్ల విమర్శ సేయుచున్
విరచనసేసి బ్రహ్మపథ విశ్రుతసత్కృతి వెల్లడించితిన్
బరువడి జీవుఁ డీశుఁడు ప్రపంచమునన్ గతి ముక్తియున్ నిష
ద్వర గదితార్థరత్నముల వాస్తవ మెంతయు నిర్ణయించితిన్
గురుకలిదోషనిర్హృతికిఁ గూర్పఁ దలంచితి నైషధీయమున్

సిరిగలహర్షసత్కవి విశిష్టకవీడ్యుఁడు నీలకంఠుఁడున్
వరమతి యాత్రివిక్రమపుభట్టు సరస్వతి కున్కిపట్టు సుం
దరశతదృశ్యవిశ్రుతుఁడు నారపదోపగతాయనుండు ము
ద్గురుచరణానుజుండును నతుల్యవిధంబున నైషధావనీ
శ్వరుచరితంబు వర్ణనము సల్పిరి నిర్జరభాష నాకు నా
దరము స్వభాషపైఁగలదు తథ్యమె యైనను తత్త్వశాస్త్రసా
గరము మథించుటం బ్రదుకుకాల మశేషము దీఱిపోయె వ
త్సరములు దాఁటె డెబ్బదియు సల్పుదు నెట్లిపు డెందుఁజూచినన్
సరసకవిత్వ శేవధులు సంస్తుతభావకృతిప్రయోజకుల్
పురిపురి నిండియుండి కవిపుంగవసంఘము ఱంకెలార్చు నీ
తరుణమునం దసంస్తుతపుదారిని వెల్వడి లోకహాస్యతన్
దొరయకయుంట మేలనుట దోఁపక యానితి దేశభాషనే
కరణినిఁగాని యాత్మమతికౌశలయుక్తికిఁ బోలునట్లుగా
వరవుడ మాచరించుట యవశ్యవిధేయమునాఁ దలంపు చే
నరయఁగ నాత్మభాష యగునాంధ్రము నందనురక్తియుం గవీ
శ్వరతతియందు నింపెసఁగుభక్తియు నిందుఁబ్రయోజకంబు లీ
శ్వరుఁడఖిలప్రచోదకుఁడు భావపథంబున, నేమి చూపునో
సురగణవాణి సత్కృతుల సూరులు పూర్వులిఁకేమి వల్కిరో
యరయక కూర్తు నర్ధ మది యంతియె నాపని గాంచుడీ సుహృ
ద్వరులు మదీయమాకృతి భవద్ధృదయంబుల నచ్చు కుండినన్
స్థిరకలిసంకటోధృతిఁ బ్రసిద్ధ నలక్షితిపాలు గాథ సుం
దరనిజదేశభాషయు ముదం బొదవింపక యెట్టులుండు నా
పరమనిజాశయంబుననె వర్తిలితిన్ గనుఁడీ మహాకవుల్
విరచన మిద్ది మీ మదికి వెక్కసముంగలిగింప కుండెడిన్
భరవుడు నిర్విశేష మగుభావము నీ కృతియందు స్వీయమా
వరకృతియందుఁ బోలె ననవద్యసమత్వసమిద్ధబుద్ధులై.

గ్రంథకర్త.

# ముద్రణార్థ ధనప్రదాతృ ప్రశంస

**సీ.** విజయవాటీపురీ విశ్రుతావాసుండు
వైశ్యకులాబ్ధి జైవాతృకుండు
నాగభూషణ లక్ష్మినరసమాంబికల
తృతీయసుతుం డద్వితీయ యశుఁడు
శ్రీవేంకటేశాంఘ్రి సేవాపరుం డర్థి
చాతకసందోహ జలధరుండు
సాధువర్యామృతనాథ సద్గురుబోధ
మధుమత్తసచ్చిత్త మధుకరుండు

**తే. గీ.** మహిత చుండూరి సద్వంశ మౌక్తికుండు
నైన వేంకటరెడ్డిగుప్తాఖ్యుఁడెలమి
నలప్రవాసాఖ్యకృతి ముద్రణంబుసల్పఁ
జాలు ధన మిచ్చి భూరియశంబు గొనియె.

**సీ.** ఆంగ్లకలాశాల యభివృద్ధినొందించె
సర్వకలాశాల నిర్వహించె
పండితమండలి బహురీతిఁ బోషించె
కృతులంది సత్కీర్తి వితతి గాంచె
అన్నాది వివిధపదార్థదానంబుల
నతిథిసన్నుతికిఁ బాత్రత వహించె
ఇంక నల్పనియట్టి వేమిసత్కార్యము
లని సన్నుతించెడు నఖిలజనుల

**తే. గీ.** ప్రీతికిటువగు వేంకటరెడ్డి నెఱమి
నాయురారోగ్య విపుల భాగ్యయుతుఁజేసి
స్కందగజముఖ పార్వతీసహితుఁడైన
యభవుఁడనుకంప మనుచుత మనవరతము.

సీ. పుత్రవంతునిఁ జెప్పఁ బురుషపదంబని
ప్రాకృతజనములు బలుకుచుంద్రు
పురుషత త్త్వముకన్నఁ బరములే దనుశ్రుతి
పరమేశుఁ బురుషుగాఁ బ్రస్తుతించు
దివి ముట్టి భువి యెల్లనివిరినసత్కీర్తి
ధరుఁడు పురుషుండనె ధర్మసూక్తి
యాపదం బెవ్వనియందు యథార్థమై
యలరారుచుండు నీ యమలచరితు

తే. గీ. మహిత చుండూరి వంశాబ్ధితుహినకిరణు
ననఘు వేంకటరెడ్డి విఖ్యాతనాము
నవిరతైశ్వర్యధుర్యుఁగా నాచరించి
శర్వరీనాథ మకుటుండు సాఁకుగాత.

శా. శర్మంబబ్జహితుండనశ్వర మహైశ్వర్యంబు నీశానుఁడున్
ధర్మాసక్తిని ధర్ముఁడున్ వితరణోత్సాహంబు శర్వాణియున్
నిర్మర్యాదయశస్సమృద్ధి రజనీనాథుండు నిత్యంబు స
త్కర్మార్థార్పిత భాగ్యుఁడై యలరు వేంకట్రెడ్డికిన్ గూర్చుతన్.

శా. కింకర్వత్సరవల్లభుండయిన పంకేజాక్షుఁ డెల్లప్పుడా
తంకంబు ల్దొలగించి ధర్మమున నుత్సాహంబు సంధించి ని
శ్శంకంబర్థమునెల్ల ధర్మముననే సంధించుచున్నట్టి యీ
వేంకట్రెడ్డినిఁ జేయుగావుత కృపన్ విశ్వోన్నతశ్రీయుతున్.

శా. లౌల్యంబున్ దొలగించి నిర్మలవిశాలజ్ఞప్తితో ధర్మవై
పుల్యాసక్తినిఁ గూర్చియున్ మఱియు సంపూర్ణాయురారోగ్యముల్
కళ్యాణంబు లొసంగుగావుత మహైకల్యంబుగా విస్ఫుర
త్కళ్యాణాచల కార్ముకుండు కృప వేంకట్రెడ్డి కశ్రాంతమున్.

# కృతి సమర్పణము

తే. గీ. సాధ్వి లింగాంబ నీకుఁ బ్రశ స్తమైన
నల ప్రవాసంబు రసికజనంబులలరఁ
గృతినొసంగితి భక్తిసంభృతముగాఁగ
నీ వొనర్చిన సేవకు నిష్కృతియుగ.

తే. గీ. సహనసౌశీల్యగుణముల సాటిలేక
యద్యతనసాధ్వివగు నీకు నట్టిదైన
ప్రాక్తన సతీచరిత్రంబు ప్రాజ్ఞు లలరఁ
గృతినొసంగితి గొను సుధీనుతగుణాఢ్య.

ఉ. కీలితమా కుటుంబజన, కింకరత న్మదిరోసి కొండరా
చూలిసపర్యకై యటకుఁ జొచ్చితివేమొ సరే సురాంగనా
జాలము మెచ్చ దేవిపరిచర్య లొనర్చుచు నేను వచ్చున
క్కాలము వేఁచియుండుము, సుఖంబున నందవసించి భామినీ!

సీ. కూతులు సంతతిఁ గూడియుల్లసిలిరి
కొమరులు గేస్తులై కొమరు గనిరి
అఱువదివర్షంబు లాయువు నెగడెను
గృహపతి యారోగ్య మహితుఁడగును
ఐహిక భోగార్థ మనుభవించుటచాలు
క్షితిని సౌమాంగళ్య మృతియె మేలు
ముదిసి మంచంబున మూల్గుచునుండియు
బంధుల విసిగించి బాధపడుచు

గీ. నీచతవహించి యెప్పుడో, నీల్గుకంటె
ఇపుడ దివికేగు టనువని యేగినావొ
కృతిని గైకొని శాశ్వతకీర్తిగాంచి
పరమ శివలోక సౌఖ్యంబు బడయు మబల!

సీ. అసమ రసాస్వాదలసితులుగాని యీ
  చరితంబు నన్యులు చదువబోవ
రర్థవిశేష భావాభిజ్ఞులేగాని
  మొఱకు లీచరితంబు ముట్టరారు
తాదృశుల్ నిన్మది దలచుటకంటె నీ
  జన్మంబు వేరెట్లు సఫలమగును
సుజనులచిత్తంబు సోకు భాగ్యము కంటె
  నిహపరసాధక మెందుగలదు?

గీ. ఇట్లు యోచించి యీకృతి నిచ్చినాఁడ
అంబికేశుని సుప్రసాదంబుగాంచి
యపునరావృత్తి పదమున నధివసించి
యవిరతానంద నిధి నోలలాడు మతివ!

చ. సతి యెడబాటు మంట సెగ సైపక యిట్లు వనర్చెనంచు పం
డితులు హసింతురేమొ తరుణీ! యటులైనఁ గృతజ్ఞతాగుణో
న్నతి విదులౌ గుణజ్ఞులు మనంబున మెచ్చరె నీయెడన్ గృత
ఘ్నత వహియింపజాలకయ కానుక నిచ్చితి గొమ్ము కోమలీ!

మ. ధనికుల్వేడిన నీయనొల్లని పవిత్రంబౌ కృతిన్ విజ్ఞతా
వినుతంబైన భవద్గుణౌఘమునకున్ వెచ్చించితిన్ దాన నో
వనితారత్నమ! ఇద్ది భూతలమునన్ వర్తించునందాక శం
భుని సాన్నిధ్యమునం దపార పరసమ్మోదాంబుధిన్ దేలుమా.

గీ. అనుచు ముదిగొండ నాగలింగాహ్వయుండు
సతియెడఁ గృతజ్ఞతామతి సరసమైన
నలవిలాసాఖ్య కృతి గుణాకలితమైన
లలనకర్పించె పండితవలయ మలర.

---

కింకవీంద్ర ఘటాపంచాననేత్యాది బిరుదాంకితులగు
బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిలవారు

# అభిప్రాయము

క్షీరసాగర, బెజవాడ.
కృ॥ డి॥
21—6—46

శ్రీ మత్సర దేవతాయైనమః

1. నలవిలాసము, 2. నలప్రవాసము

అను నీరెండు నాటకములును ఆంధ్రములో శ్రీజగదారాధ్యులు ముదిగొండ నాగలింగశాస్త్రిలుగారు విరచించిరి. వీరివంటి విద్వత్కవులు నేఁటికాలమున మృగ్యు లనుటకన్న అసలే లేరనుట సత్యదూరముగాదు. వీరినాటకములు దశరూపకాది లక్షణగ్రంథములలోని కట్టుఁబాట్లను లేశమును నుల్లంఘింపక హృద్యముగా ననవద్యముగా వైవాఱుచున్నవి యని నేనభిప్రాయపడుచున్నాఁడను. ఇందలి సత్యాసత్యములను విద్వాంసులు పరిశీలింపఁగలరు. ఇది సూత్రప్రాయమగు నాయభిప్రాయము.

(సం) వేం. శా. శతవధాని

కవిసార్వభౌమ, మహామహోపాధ్యాయ
బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

## అభిప్రాయము

నలప్రవాసము:- ఇది శ్రీజ్వాలాంబికా ఘోరనాథారాధ్య పుత్రులును భారద్వాజగోత్రులు నగు యోగి శ్రీ ముదిగొండ నాగలింగారాధ్య పండితులచే రచింపఁబడిన తొమ్మిదంకముల నాటకరాజము. ఇందు నలుఁడు జూదమున రాజ్యమోడిపోయి ప్రవాసము చేసి వెండియు రాజ్యమునొందిన కథ పొందుగఁ గూర్పఁబడినది. నాగలింగారాధ్యులవారు సంస్కృతాంధ్రముల నసమానపాండితిగల మహాకవులు. బ్రహ్మపథము, వేదాంతార్థ పరిష్కారము, లోనగు సంస్కృత గ్రంథములును, కాదంబరి, నలవిలాసము లోనగు నాంధ్ర గ్రంథములును రచించియున్నవారు. వీరి రచనయందెట్టి దోషములును గనుపట్టవు. శైలి నాతి కఠినమృదుమధురముగా నుండును. వీరెపుడును బూర్వకవుల మార్గము ననుసరించియుందురు. గాని మన నవనాగరకుల మత మనుసరించి యుండరు. ఇందుఁ గరుణ, విప్రలంభశృంగారములు యథోపయోగముగా వర్ణింపఁబడియున్నవి. ఇందలి పద్యములే కాక గద్యములును మనోహరములనుట యతిశయోక్తి కాఁజాలదు. కథా సంవిధానము పండిత పామరజన హృద్యమై యున్నది.వీరి గ్రంథముల పైన నభిప్రాయ మొసంగకలవారు సమర్థులిపుడు లేరు. అయినను వారు నన్నుఁ గోరిరి గావున సంశయింపక యిట్లు వ్రాసి యిచ్చిన సాహసమున కెల్లరు నన్ను మన్నింతురు గాక.

(సం.) శ్రీ. కృష్ణమూర్తి శాస్త్రి.

# అభిప్రాయములు

'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణగారు
లెక్చరర్, యస్. ఆర్. ఆర్. వి. ఆర్. కాలేజి, బెజవాడ.

తమ నాటక రచనా నైపుణ్యమునుగూర్చి నా వంటి కించిజ్ఞుఁడు వ్రాయఁదగిన దేమి? కాదని వ్రాసిన చోఁ గొన్ని పుటలు పట్టును. నల చరిత్రములోని సొగసు నన్నయ్యగారికే తెలియును, మరల తమకే తెలియును. ప్రతియంక మొక్కొక్క రత్నము. ఎన్నో వ్రాయ వలయునని యున్నది. రసము సర్వత్ర చిప్పిలుచున్న యీ కృతిలో గొన్నిచోట్ల నందములు చూపించుట మతిదోషముగదా. దమయంతి సుదేవునితో నన్ను భైమినని తెలియఁజేయనలదని ప్రార్థించుట పరమ లోకానుభవానుసంధానము. మఱియు బాహుకుని రథవేగము వలనఁ గలిగిన ఋతుపర్ణుని భయము నాన్యతోదర్శనీయము. తమ కృతి యనేకగుణములకుఁ బుట్టినిల్లుగా నున్నది. మహాపండితులు మీరింత భావనాశీలురగుటలో నాశ్చర్యమేమున్నది? అష్టమాంక మున నలుఁడు చేసిన కలికాలవర్ణనము బాణకృతమా అన్నట్లున్నది. కేశిని చేసిన దీర్ఘోపన్యాసములు సప్రయోజనములై శిల్పరమ్యత కాస్థానములుగా నున్నవి. మీ పద్యరచన తెనుఁగునకు తెనుఁగు, సంస్కృతమునకు సంస్కృతము పరమభావభరితమై యున్నది. ఏదో వ్రాసితిని. క్షమించుడు.

చిత్తగింపవలయును,
విధేయుడు,
(సం.) విశ్వనాథ సత్యనారాయణ
6—1—47.

కవిశేఖర విద్వాన్, విశ్వనాథ నరసింహముగారు,
B. A., B. O. L., B. Ed.
ప్రభుత్వ బోధనాభ్యసనపాఠశాల,
విశాఖపట్టణము.

తమగ్రంథమునఁ బూర్వసంప్రదాయ పరిశుద్ధమగు వాఙ్మాధుర్యము శబ్దసంస్కార సంశోభితమై ప్రతి పద రసబంధురముగా నున్నది. నేటికాలమున మిముబోటి సత్కవులుండుట అరిది యన స్వభావోక్తియగు. 'కావ్యేషు నాటకమ్ రమ్యమ్' అను మాటను ధ్రువపరచు మీనాటకరాజము కళాశాలా విద్యార్థుల కత్యంతోపయుక్తముగా నున్నదని నా యాశయము.

చిత్తగింపుడు,
(సం.) విశ్వనాథ నరసింహము
5—2—47

వేలూరి శివరామశాస్త్రిగారు, శతావధాని.
సూరవరం.

అయ్యా,

తాము పంపిన 'నలప్రవాసము' చూచితిని. ఈ నాటకము నకు దగిన గమనము వలయు పటిమ, ఉపదేశమును గలవు. దీనిని జదివి మిగుల నానందించితిని.

(సం.) వేలూరి శివరామశాస్త్రి
25—1—47

శ్రీ లక్ష్మీ హయగ్రీవో విజయతే

## అవధాని శిరోమణి, మహామహోపాధ్యాయ మధ్వ
## శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు

నే నీ నలప్రవాసము నించుమించుగ సాంతముగ చూచితి ననియే చెప్పవచ్చును. కొన్ని సంవత్సరములక్రింద నేలూరులో జరిగిన గోసంరక్షణ సంఘవార్షికోత్సవ సందర్భమున నేతన్నాటకకర్త గారు 'గోప్రభావ' మను స్వీయకృతికి ప్రథమ బహుమానము గ్రహించినప్పుడు వీరి కైతను జక్కఁగా వినియుంటిని. అప్పటికంటె నిప్పటికైత బహువిధముల శాణోల్లీఢమణివలె దేదీప్యమానమై వెలుగుటయేగాక మార్దవమాధుర్యములతోఁగూడ విలసిల్లుచున్నది. కేవల సంస్కృత భాషా భూషణులగు వీరిట్లు ఆంధ్రమునఁదును, నాటకాంతము కైత రచించుట యాంధ్రభాష కొక భూషణము. ప్రకృతకాలమున సాంఘిక రాజకీయ నాటకములయం దభిరుచి గలవారికి నీ యైతిహాసిక నాటకము సంతసము గొలుపక పోదు. ఇందు రసము సులువుగ నే గోచరించును. ఈ నాటకము సినిమాలకెక్కినచో లోకమునకు జక్కని నీతిని బోధించి కలియుగమును కృతయుగముగ మార్పఁగలదని నా యాశయము.

(సం.) కాశీ కష్ణాచార్య

16—2—47

# శుద్ధప్రతి

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 19 | ఊరడిలుము | ఊఅడిలుము |
| 15 | 9 | పధా | పథా |
| 20 | 19 | జాగ్రత | జాగర |
| 22 | 16 | మాత్ర | మాత్రు |
| 24 | 25 | చిల | చిర |
| 34 | 5 | మునకిద్ది | కియ్యది |
| 35 | 20 | బతి | పతి |
| 36 | 26 | జాత | జాతి |
| 45 | 19 | జాగ్రతయ యిపుడు | జాగరిత మిప్డు |
| 47 | 4 | దుర్దట | దుర్దశట |
| 54 | 10 | నాధుడ | నాథుఁడ |
| 55 | 11 | నాధా | నాథా |
| 58 | 21 | నికృపనే | కృపాప్తి |
| 62 | 8 | రహిత | భిన్న |
| 73 | 26 | గొనదను | గొనవలె |
| 77 | 26 | తే.గీ. పాతులు దేవల్ | ఆ.వె. పాతులైన సురలు |
| 86 | 11 | నర | నరు |
| 91 | 24 | ద్విరదఖంజనభంజన | భ్రమరఖంజనకుంజర |
| 103 | 16 | యిద్దాని | నిద్దాని |

 ముద్రణార్థ ధనప్రదాతృ ప్రశంస

4 వ పేజీ 15 వ పంక్తిలో

తప్పు

నిర్మర్యాద యశస్సమృద్ధి రజనీనాథుండు నిత్యంబు స

ఒప్పు

నిర్మర్యాద యశస్సమృద్ధి శశియుఁ నిత్యంబు నిశ్శేష స

# ఉపోద్ఘాతము

కావ్యములలో నాటకముత్తమము. 'నాటకాంతం సాహిత్యమ్' అని సంస్కృత సంప్రదాయము. కాని యిట్టిది తెలుగునం గన్పట్టదు. తెలుగున నాటకములు లేకపోవుటకు మాత్రము కారణము మృగ్యమే.

ప్రారంభమునుండియు నేర్చికూర్చిపెట్టిన సంస్కృత సంభారమును గొంతను తరువాత క్రమక్రమముగా తెలుగులోనికి వచ్చిన భారతీయసాహిత్యము లన్నియు తమలో ప్రతిఫలింప జేసికొనినవి. కాని నాటకీయసారస్వతము ప్రతిబింబించక పోవుటకు కారణము తెలియదు.

1. నాటకము గద్యపద్యాత్మకము. కావున గద్యపద్యాత్మక ప్రబంధాదిరచనల చేతనే యా ఫలము సిద్ధించినదని తలచి తెలుగు కవు లూరకుండి యుందురో లేక
2. నాటకమున నాయా పాత్రల కుచితభాషల నుపయోగింపవలసి యుండుటచే వ్యావహారిక భాషనుపయోగింప వలసివచ్చునను భయముచే వదలియుండురేమో ?
3. మొదటినుండియు రాజాశ్రయమునం దెనుగు వృద్ధిబొందిన దగుట, పురాణ, కావ్యాది రచనలను బ్రోత్సహించిన రాజులు నాటక విముఖులగుటచేతనో,
4. ఆ కాలమున నాటకప్రదర్శనానుకూలములగు రంగస్థలములు, దీనికి దోహదమిచ్చు ప్రజాభిప్రాయములు లేకపోవుటకూడ ముఖ్యకారణములై యుండవచ్చును.
5. సంస్కృత పురాణ కావ్యాదుల తెనిగించునపుడు, తెనుగుకవులు చూపు స్వాతంత్ర్యము నాటకాంధ్రీకరణమునం జూప నవకాశము లేక పోవుటచేతనో యేమో, స్వతంత్రరచనలు లేకపోగా నాటకాంధ్రీకరణమున గూడ తెలుగుకవులు తలపెట్టలేదు.

2. నాట్యము. ఇందు నభిరుచి యెప్పటినుండి గల్గినది. మనదేశమున నాటక రచనలకుం బూర్వమే నాట్యమున యందభిరుచి గల్గినట్లు దెలియుచున్నది. 11 వ- శతాబ్దిమొదలు 16 వ- శతాబ్ది వరకు సంగీతనాట్యకళలు రెండును కవల పిల్లలవలె చక్కగా సమున్నతము పొందినవి. సంగీతముతో పాటు నాట్యకళ, నాట్యకళతో పాటు సంగీతము, అన్యోన్యాశ్రయము లౌటచే జంటగా పెరిగినవి. ఇంతకుం బూర్వము వీని యస్తిత్వమును గూర్చి యనుమాన ప్రమాణమునకుంగూడ సందేహమే. వీనికి మొదట దోహదమిచ్చినది దేవాలయములు. దేవాలయాభివృద్ధిగూడ 11 వ శతాబ్దిలోనే. ఈ నాట్యకళను విశిష్టముగ నభ్యసించినది దేవదాసీలు - భోగమువారు, గుడిసానులు, వేశ్యలు.

ఇందుకు తార్కాణముగా బెజవాడ మల్లేశ్వరస్వామివారి యాలయములో శాసన ఫలకములమీద, పినతూనబత్తుడు మద్దెల వాయించుచున్నట్లు, మాచల్దేవి నాట్యము చేయుచున్నట్లు రేఖాచిత్రములు గన్పడును. నాట్యభంగియు చాల మనోహరముగా నున్నది. రెడ్డిరాజుల కాలమునఁ గూడ నాట్యకళ యభివృద్ధి చెందినది. అనవోతభూపతి కుమారుడు కొమరగిరిరెడ్డి 'వసంతరాజీయ' మను నాట్యశాస్త్రమును రచించినాఁడు. అతని యాస్థానమున లకుమాదేవి యను నర్తకి క్రొత్త క్రొత్త పోకడలతో నాట్యార్థ రహస్యముల నభినయించుచు నుండెడిదట. మొత్తముమీద 11 మొదలు 15 వ శ. కలకు నాట్యసంగీత కళలభివృద్ధి పొందినవనియే చెప్పవలయును.

3. నాటకీయకళ. వేములవాడ భీమకవి కాలముననే నాటకము లున్నట్లు కళింగగంగు కథ తెల్పుచున్నట్లు కొందఱు చెప్పుదురు. తిక్కనకుఁ బూర్వమే గోన బుద్ధారెడ్డి విరచితమగు రంగనాథరామాయణము తోలుబొమ్మలాటవారు పాడుచుండెడివారట. నాటకరచన లేకపోయినను భారతాది గ్రంథములలో నాటకీయ కళ యుట్టిపడుచునే యున్నది. తిక్కన భారతమునకు ప్రశస్తి వచ్చుటకు కారణమదియే. విరాటపర్వ మిందులకు ముఖ్యముగా నుదాహరణము. పురాణమువలె వ్రాయుచున్నను తిక్కనను నాటకీయకళ యావేశించినది. తదనుగుణముగ నాటకమునకు జీవమగు సంభాషణాత్మక శైలి (conversational style) నడచినది. దీనికి మొదట దారి తీసిన వాడితడే. ఇంతవఱకు తెరచాటున దాగుడుమూత లాడు నాటకీయకళ శ్రీనాథుని కాలమున తెఱదాటి వచ్చినది. ప్రజాదృష్టి నాటకములవైపు మరలినదని చెప్పవచ్చు.

"కల్లికిచక్కి, కామాళము, వంశము, ధక్కి, హులుక్కి ఝుక్కుట్
ఝల్లరి యాదిగాఁగలుగు శబ్దపరంపర తాళశబ్దమై
యుల్లసిలం బ్రబంధములు కొప్పగ" పల్లవపాణు లాడుదురని శ్రీనాథుడు తన కాశీఖండమున వ్రాసికొనినాడు. ప్రబంధముల కనువుగ పల్లవపాణు లాడుచుండువారట. కనుక యీ ప్రబంధములు సాధారణ ప్రబంధములు కావు. యక్షగానము లనియే చెప్పవలయును. యక్షగానములను ప్రబంధకోటికి జేర్చిన వాడితడనియే జెప్పవలయును. ఈ విషయమునే శ్రీనాథుఁడు భీమఖండమునఁ బ్రథమాశ్వాసములో భీమేశ్వరుఁడు కొలువుండురీతి కల్పించుచు స్పష్టము చేసినాడు. ఉన్నంతలో క్రీడాభిరామము మొదటిది. ఇది శ్రీనాథుని కృతియనియే కొందఱభిప్రాయము. 'వీథినాటకము' గూడ

శ్రీనాథుని కృతియే. ఇది నాటకము కాకపోయినను, నాటకమని పేరు పెట్టుట, యా కాలమున గల నాటకాభిమానమును తెలియఁజేయును. తరువాత కొంతకాలము వఱకు నాటకములుగాని, నాటకరచనలుగాని కనఁబడవు. కాని తరువాత కవుల ప్రబంధములఁ బరిశీలించిన నాటకీయకళ మరుగుపడినదని చెప్పుటకు వలనుపడదు. (1475) 15 వ- శతాబ్దివాడగు ముక్కుతిమ్మనకృతి పారిజాతాపహరణము, నాటకకళాప్రవృత్తి మగుటచేతనే వన్నెకెక్కినది. ఆతడు పురవర్ణనాదులతో ప్రబంధము నారంభింపక రంగస్థలమునే సృష్టించినాడు. ఇయ్యది, రంగములుగ విభాగింపఁబడిన యొక నాటకమే యగును, చంద్రోదయాది వర్ణనలు జేయక పోయిన పాపము చుట్టుకొనునను భయముచేఁ గాబోలు వానిని గొన్నిటి నిందు బలాత్కారముగఁ బ్రవేశపెట్టినాఁడు. ఇట్లు క్రమక్రమముగ నాటకాభిమానము పెరుగుచున్నను నాటకరచనకు కవులుపక్రమింపలేదు. నాటకములను నాటకములుగా దెనిగించుటకు కాలపరిస్థితు లనుమతింపకఁ బోవుటచేతనో వానిమీది యభిమానమును వదలలేకయో, కొందఱు కవులు వానిని ప్రబంధరూపమున దెనిగించిరి, అట్టివారిలో ఘంటసింగన, నందిమల్లయ, పినవీరభద్రుడు ముఖ్యులు. వీరు 15 వ- శతాబ్దికి చెందినవారే. మొదటి యిద్దఱు జంటకవులు. వీరు కృష్ణమిశ్ర విరచితమగు ప్రబోధచంద్రోదయ నాటకమును కొందిమార్పులతో దెనుగున ప్రబంధముగా రచించిరి. మూలాతిక్రమణ మెక్కువగ జేయక మూలములోని సొగసుల దిద్ది తీర్చిరి. కాని పినవీరభద్రుడు కాళిదాసకృతి యగు శాకుంతలమునుఁ దెనిగించుచు యథేష్టముగ మార్పులఁ జేయుచు చివరకు కలగూరగంప చేసి విడచినాఁడు. అందువలన నాటకములోని సొబగు కొంతవఱకిందు మఱుగుపడినదనియే చెప్పవలయును. తరువాత 16 వ- శతాబ్ది వాడగు పింగళి సూరన నాటకములు వ్రాయకపోయినను, నాటకముల దృష్టిలోనుంచుకొనియే రచనలు చేసినట్లతని కృతులవలనఁ దెలియును. ఆ కాలమున నాటకము లున్నవనుట కాతని ప్రభావతీ ప్రద్యుమ్నము ప్రబలసాక్ష్యము. ప్రభావతీ ప్రద్యుమ్నము, కళాపూర్ణోదయము, పారిజాతాపహరణము వంటివే. కాని ముక్కుతిమ్మనకంటే పింగళిసూరన రంగస్థలమును విశాలముఁ జేసినాడు. శ్రీనాథుని కాలములోనే బయలుదేరిన యక్షగానముల నింతవఱకు పండిత కవులాదరించినట్లు కనఁబడదు. అవి సంస్కరింపబడక పోవుటచే వాని యందలి సాహిత్య గౌరవము తగ్గినది. 17 వ- శతాబ్దిలో వీనికి ప్రచార మెక్కువైనది. కూచిపూడి భాగవతులీ కాలము నుండియే నాటకమాడుచున్నట్లు ప్రమాణములు గన్పట్టును. మొదట, గేయములతోను సంగీతముతోను నిండిన యక్షగానములలో పద్యములను, అవసరోచిత భాషను ప్రవేశపెట్టిరి.

వీరికి మూలపురుషుఁడు సిద్ధేంద్రయోగి. అంతరించుటకు సిద్ధపోవుచున్న యాంధ్రనాటక రంగమును, సత్యమైన భరతశాస్త్ర పద్ధతిని వెలయించుచు, మేలుకొలిపినాఁడు. దీనికి ఆంధ్రదేశమంతయూ స్వాగతమిచ్చినది. ఇతని రచనలలో 'భామవేష' మను పారిజాతము ముఖ్యమైనది. ఇందులో ముద్దుల మూటగట్టు వచనములు, రసవత్తరములగు పద్యములు చాల యున్నవి. భరతనాట్యమున కిందు ప్రాధాన్యమున్నను నాటకలక్షణములు లేక పోలేదు: కవిచాలవఱకు సంస్కృత సంప్రదాయము ననుసరించినాఁడు. ఇట్టి యక్షగానముల నెక్కువగా నాదరించిన వారు తంజాపురాంధ్ర నాయకరాజులు. ఆంధ్రభాష వీరి కాలమున పల్లారుముద్దుగాఁ బెరిగి, క్రొత్త క్రొత్త నలంకారములతో వింతవింత సొబగులతో విరాజిల్లినది. కేవల ప్రబంధరచనలే గాక, నాటకములు, యక్షగానములు, రోలలు, ద్విపదలు, అధ్యాత్మసంకీర్తనలు, గేయములు మొదలగు ననెన్నియో వెలుగులోనికివచ్చినవి. వీనిలో నాటక రచనా విధానమునకుఁ దోవచూపినది విజయరాఘవ నాయకుడు. ఈయన 24 నాటకములు 5 భ్రమరగీతలు వ్రాసినాడు. ఇంతమాత్రమే కాక నాట్యములో నాయారాగముల కనుకూలముగ గుజరాతి - దేశి - చౌపదము - జక్కిణి దురుపదము - మదనపదద్యోతము - జోగిపజావళి - శారదా సామ్రాజ్యము - నవరత్నమాలిక మొదలగు నాట్యగేయములను రచించినాడు. ఇవి యాతఁడు రచించుటయే గాక - ఒక్కొక్క నాట్యమునం జాఁతేరిన యొక్కొక్క నట్టువరాండ్రు వీనిని సభలలో నాడిపాడి వెలయించుచుండెడిదని యాతని యాస్థానకవి యగు చెంగల్వకాళకవి వర్ణన వల్ల తెలియుచున్నది. ఇట్లు రచింపఁబడిన యక్షగానములు అముద్రితాంధ్రవాఙ్మయ సూచిని బట్టిజూచిన దాదాపు 400 కు పైగా నున్నట్లు తేలుచున్నవి. ఈ యక్షగానములను వేషములుగట్టి యప్పటికే యాడుచుండువారట.

" నాకు దోచునట్టు లానందమొప్ప ధర్మాంగద చరిత
మనగ చిత్రాంగద విలాప మనగ యక్ష
గాన మొనరింతు వేషములగట్టి జనులు పాడి వినుపింప " అని అయ్యగారి వీర

కవి తాను వ్రాసిన చిత్రాంగదవిలాప మను యక్షగానమున వ్రాసినాడు. ఈ రాజుల కాలముననే యక్షగానములు నాటకములు బాగుగా ప్రదర్శింపఁబడుచుండెడివి. ఇందు కొఱకై రాజులు రాజభవనములలో నాట్యశాలల నేర్పాటుచేసి యందు వీనిని ప్రదర్శింప జేయుచుండువారు. స్త్రీలుగూడ వేషములు ధరించెడివారు. ఈ విషయమునే రఘునాథరాయలు చేమకూర వెంకటకవియు కంఠోక్తిగా చెప్పినారు.

" భరతవిద్యాధురంధరుడౌట రంగస్థలంబు రామాలంకృతం బొనర్చె " కథాసాధ.

" మాటల నేర్పులా సరసమార్గములా కొలువుండు రీతులా
పాటలగంధులా కళల భాగ్యములా బహుదానలీలలా
నాటకశాలలా యొకట నన్నియు డెన్నిక జూడ నన్నిటన్
మేటి "
విజయవిలాసము.

ఇట్లు యక్షగానములు వ్రాసినవారంద ఱు పండిత కవులే. ప్రబంధకవులు కూడ నిరంకుశోపాఖ్యానము వంటి ప్రబంధములు వ్రాసి రాజుల యాస్థానమున మెప్పొందిన కందుకూరి రుద్రకవి జనార్దనాంకితముగా సుగ్రీవవిజయమను యక్షగానమును రచించి నాడు. అప్పకవీయకృతి కర్తయగు కాకునూరి అప్పకవి అంబికావాదమను యక్షగా నమును వ్రాసినాడు. ఇట్లు చాల యుదాహరణములు చూపవచ్చు.

కూచిపూడివారికి తోడు ఘట్టుదేశపువారు - లేపాక్షివారు - ధర్మపురివారు దేశ దేశములను సంచరించుచు నాటకముల ప్రదర్శించుచుండెడివారు. కాబట్టి పగటివేష ములు, తోలుబొమ్మలు యక్షగానములు, ఆంధ్రదేశమున నేటినాటకరూపముగా పరిణ మించినవి. వీనిని చెప్పుకొనదగిన నాటకములు లేవనియే చెప్పవలయును.

# యక్షగానము - నేటినాటకములు

యక్షగానములకు నేటి నాటకములకుఁ జాల వ్యత్యాసముఁ గలదు. యక్షగాన మచ్చముగా దేశీయఫణితి నవలంబించినది. నాటకము సంస్కృతరీతి ననుసరించి పాదు కొలిపినది. యక్షగానములలో నున్న భరతవిద్యా ప్రసంగమునకిందు తావులేదు. అది వీధినాటకము. ఇది శిష్టరంగస్థలము. నృత్యగీతాది సంబంధము కలది యక్షగానము. ప్రదర్శనమే ముఖ్యప్రయోజనముగా గలది నాటకము. నాట్యమునకు భరతమునకుఁ గల సంబంధమును బోనీక నిలబెట్టినదీ యక్షగానము. ఈ సంబంధమును రూపుమాపినది నాటకము. అనగా నాటకము పైవానిని విడదీసినది. యక్షగాన నాటకముల యభినయవిద్య చాల సుశిక్షితము. నాటకములలోని యభినయములో శిక్షతక్కువ. ఈ శిష్టరంగస్థల నాటకములు ప్రథమమున కేవల గద్యరచనలో రచియింపఁ బడినవి. తరువాత రెండవ యవస్థలో గద్యపద్యాత్మక ములగు నాటకములుగా మాఱినవి.

ఈ నాటకములు సంస్కృత సంప్రదాయాను బద్ధములైనను సంస్కృతనాటక లక్షణములకు లోఁబడి రచింపఁబడినవి కావు. కొన్ని యెడల మాత్రము తదనుగుణము లుగా నుండును. సంస్కృతమున దశవిధరూపక భేదములు గలవు. తెలుగున నట్టి భేదము

కాన్పించదు. అన్నిటికిని నాట్యమనియే వ్యవహారము. సంస్కృతమున నాటకమున వీర శృంగార రసములలో నేదే నొకటి పోషింపబడవచ్చును. నాయకుడు ధీరోదాత్తుడు. ఇతివృత్తము ప్రఖ్యాతము. తెనుగున నట్టినియమము లేదు. కావున సంస్కృత నాటకలక్షణముల ననుసరించి యాంధ్రనాటకముల విమర్శకు బూనుకొనరాదు.

ఇట్టి నాటకములు ప్రకృతకాలమున ననేకములు బయలుదేరినవి. సంస్కృతాంధ్రములయందు సమాన ప్రజ్ఞగలిగి రంగస్థలమున కనువుగా చక్కగా వ్రాయగలిగిన వారు తక్కువ. ఉభయభాషా స్వాతంత్ర్యమును జూపుచు నాటకలక్షణ పరిపూర్ణమైన నాటకములలో 'నలప్రవాస' మొకటి.

# నాటకము

ఈ నాటకమును రచించినవారు శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రులవారు. వీరు సంస్కృతాంధ్రములయందు చక్కని ప్రజ్ఞగలవారు. వీరు సంస్కృతమున 'బ్రహ్మవధము' మున్నగువానిని, తెనుగున 'కాదంబరి' మొదలగు వానిని విరచించిరి. సంస్కృతాంధ్రములం బండితులగు నిట్టివారు, తెలుగున నాటకరచనకు బూనుకొనుట ముదావహము.

భారతము నందలి నలకథను మూలముగా గైకొని యందలి పూర్వ చరిత్రమును 'నలవిలాస' మను నాటకము వ్రాసిరి. ఈ నలప్రవాస నాటకములోనిది తరువాతి చరిత్రము. అనగా నలదమయంతుల వివాహానంతరము కలిపురుషుని ప్రతిజ్ఞతో నాటకము ప్రారంభమగును.

ఇంతకు బూర్వమే పెక్కుమంది కవులు నలకథను సంస్కృతాంధ్రములం గావ్య నాటక ప్రబంధ రూపముల వెలయించిరి. నైషధము, సహృదయానంద మను కావ్యములు సంస్కృతమునం గలవు. శ్రీనాథుని శృంగారనైషధము ప్రసిద్ధమే. అది గాక శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులుగారు తెనుగున నలప్రబంధ మొకటి వ్రాసిరి. కాని నాటకముగా వ్రాసినవారు తక్కువ. సంస్కృతమున [illegible] నైషధమను నాటక మొకటి గలదు. కాని దానికిని దీనికిని పోలికలు లేవు. తెలుగున నీ కథను నాటకముగా మొదట వ్రాసినది ధర్మవరం కృష్ణమాచార్యులవారు. మొదట నాంధ్రనాటకరంగస్థల మలంకరించినదీ నాటకమే. వీరు, సుమారు ఇరువదికి పైగా నాటకములు వ్రాసిరి. వానిలో చెప్పదగినది చిత్రనళీయ మొకటి. వీరు నాటక పూర్వరూపములను యక్షగానములలోని దేశీయ ఫణితిని విడచి, సంస్కృతాంగ్ల సంప్రదాయముల మిశ్రముజేసి నాటకములుగా వ్రాసిరి. అంక విభాగము, అంకములను రంగములుగా విభజించుట, నాంది, ప్రస్తావన,

యానమెత్తి యింక నెట సంబరకంపిత పాణియుగ్మవై
యేనిటు సేసినాడవని యీశునితో వెంగరపెట్టుచుంటివో.

ఇట్లు చూపవలయునన్న పుస్తకమంతయు నుదాహరణముగఁ జూపవచ్చును.

ఈ నాటకము నాయకుఁడు నలుఁడు ధీరోదాత్తుఁడు. రసము కరుణము, విప్రలంభ శృంగారమని కవియే ప్రస్తావనలోఁ జెప్పినాఁడు. నాయికా నాయకుల విప్రలంభము, తదనుగుణముగ రసము చక్కగా నిర్వహింపఁబడినది.

“సకలద్వీప మహీతలంబు మదిచే సంబాధమౌ కొల్వులో
దకలంకంబుగ నద్దినెక్కి సచివవ్యస్తాగ్రహస్తుండనై
యొకనిర్జాపున మాటచేనొకనిఁ జేయూగించి పేరోలగనిన్
బ్రకటప్రేమరసుండనై యెప్పుడు సంభావింతునో సభ్యులన్.”

ఇట్లు పూర్వస్మృతి గల్గుట స్వభావసిద్ధము :

“మున్ను స్వయంవరంబునకు మోదమున నేతెంచి పొంగ నేనుచున్
దన్నువ నే నలంకరించి నిర్జరనాయకుడనైతి నిప్పుడా
యన్నవ కర్థికే భటుడ నన్యులకుం బ్రియమారఁ జెప్ప దూతఁగా
నన్ను స్మరించి [illegible] నావలయు నాత్మ మెంగంబుల నెఱ్ఱ చూచెనన్.”

ఋతుపర్ణుఁడు దమయంతీ ద్వితీయ స్వయంవరమునకుఁ బోవుచుండ నలునకుఁ గలుగు భావపరిణామము.

తాను రాజాధిరాజయ్యు దానివృత్తికిఁ బాల్పడినను సేవకధర్మము నెరపుటలో గూడ నలుఁడు ధీరోదాత్తతనేఁ గనఁబరచినాఁడు.

“సేవకవృత్తి యందున్నవారు కష్టసుఖములఁ దలఁపఁగూడదు. అదిగాక ప్రభువు పెండ్లికిఁ బోవునపుడు సేవకుండు తడబెట్టుట బొత్తిగా గూడదు.” అదియును ఋతుపర్ణుఁడు దమయంతీ ద్వితీయ స్వయంవరమున కాయత్తమగుచుండు సమయమున నలుఁడు పల్కు వాక్యము. ఈ వాక్యములు వినిన నిజముగ గుండెలు తరుగుకొని పోవును. ఇట్టి ఘట్టములు చాల గలవు.

నాయిక దమయంతి. ఈ కవి యామెనుగూడ చక్కగ చిత్రింపఁ గలిగినాఁడు. తాను రాజాధిరాజు కుమార్తె, అధికశ్రీశ్వరియయ్యు నలుఁడు తనకు జేసిన యపకృతిని నోరెత్తి యొక్క పరుషవాక్యము నైనను పలుకని పతివ్రతాశిరోమణి పైగా తన దౌర్భాగ్యమునకుఁ దన్ను తానే నిందించుకొనినది.

ఇంకొకటి: నిర్వహణసంధి యద్భుత ప్రశాంతము. ఇదియు నొండొక విశేషము. ఈకవి జగత్ప్రాణుని పరవశమూలమైన నద్భుతరసమును పోషించి నిర్వహణ సంధిని నిష్కళంకముగా నిర్వహించిరి.

నాటకమున సంధిపంచకలక్షణ సమన్వయము.

ప్రథమ ద్వితీయాంకముల ముఖసంధి. తృతీయ చతుర్థాంకముల ప్రతిముఖసంధి. పంచమ షష్ఠాంకములు సప్తమాంకము గర్భసంధి. సప్తమాష్టకములు విమర్శసంధి. అష్టమ నవమాంకముల నిర్వహణసంధియు గలవు. సంధ్యంగములు పాత్రలు చదువు నప్పెడియుండునది.

ఇట్లు సర్వలక్షణ సమన్వితమగు నీ నాటకమును రచించిన శ్రీ శాస్త్రిలవారు ఇంకను సాంఘికములగు నాటకరాజములనుగూడ సృష్టించి యాంధ్రభాషను వన్నె తెత్తురు గాక యని యాశించుచున్నాను.

తాలూకా హైస్కూలు,
తెనాలి
23 – 2 – 1947

వ్యాకరణవిద్యాప్రవీణ
హరిసాంబశివశాస్త్రి B. O. L.
సంస్కృత పండితులు

శ్రీ

శివాభ్యాంనమః

# నలప్రవాసము

## నాంది

ఉ. పూతముదాన యిందుధరు మూర్ధతలంబున నెప్డుండుటం
బూతతరంబు చండి, పతిముందలపైఁ బొలయల్కదన్నుటం
బూతతమంబు సాంబుతలపూవగు గాంగఝరంబుమిమ్మునం
పూతులఁగా నొనర్చి, పరిపూర్ణసుఖంబుల నోలలార్చుతన్.

చ. మునువిధియంత్రణ న్వెడలి పుష్కరదర్శితమార్గమై త్రిలో
చనుని జటాటవింబడి భుజంగమసంగతి వీతరూపమై
దినకరవంశ్యయుక్తిఁ బ్రకృతింగను గాంగఝరంబు పెంపునన్
ఘనకలిపంకముంగడిగి క్రమ్మగఁజేయుత సర్వసౌఖ్యముల్.

చ. జనపతి నంతలోనఁ బరిచారకతం జరియించునట్లుగా
ధనపతి నొక్కడేగడియఁ దాళిగనుంగొనినం దరిద్రుఁ గా
ననవధి హర్షపూర్ణమతి నప్పుడ శోక విదీర్ణచిత్తుఁగా
జనతతి గూర్చు దైవ మనిశంబుశుభంబుల మాకొసంగుతన్.

నాంద్యన్తమున సూత్రధారుఁడు

(ఐదాఱడుగులు నడిచి పుష్పాంజలిచల్లి తెరవైపుఁ జూచి)

సూత్ర:- మారిషా ఇటురమ్ము.

పారిపార్శ్వకుఁడు:- (ప్రవేశించి) బావా, ఇదిగో వచ్చితిని. పని ఏమి?

సూత్ర:- తెనాలి రామలింగస్వామివారి కళ్యాణోత్సవమునకు నరుదెంచిన సామాజికులు నన్నిటు లాజ్ఞాపించిరి.

పారి:- ఏమని?

సూత్ర:- పుణ్యశ్లోకవృత్తంబును, కరుణ గంభీరంబును విప్రలంభ శృంగారపూరంబు నగు రూపక సారంబభినయింపుఁడని.

పారి:- అట్టిదేమున్నది?

సూత్ర:- యోగి శ్రీనాగలింగారాధ్య విరచితమగు నలప్రవాస మీవిద్వత్పరిషత్తున నభినయింపఁదగియున్నది.

పారి:- ఈ కృతికర్త ఇంక నేవేని గ్రంథములు రచించెనా?

సూత్ర:- ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు ననువానికిఁ గల సకల భాష్యములను పరిశీలించి, వేదపథము, వ్యాసపథమునను, కుడి యెడమ ప్రక్కదారులు గల బ్రహ్మపథమను గ్రంథము నిర్మించెను. మఱియు జగత్తు, బ్రహ్మము, జీవుఁడు, గతి, ముక్తి యను పదార్థములనుగూర్చి సంపూర్ణముగ విమర్శించి వేదాంతార్థ పరిష్కారమను గ్రంథము గూడ రచించెను. ఈ రెండుగ్రంథములను దేవనాగరలిపియందు ముద్రింపించి సకలదేశములందుఁ బ్రచారము గావించెను. ఇంకను శ్రీ నీలకంఠారాధ్య కృతియగు బ్రహ్మసూత్ర భాష్యమునకు శ్రీ శివచింతామణిప్రభయను గొప్ప వ్యాఖ్యానమును రచించెను.

పారి:- ఈయన తెలుఁగున నెవ్వియైన రచించెనా?

సూత్ర:- జ్ఞానవాసిష్ఠమను లఘుయోగవాసిష్ఠమును తెనిఁగించెను. మఱియు భట్టబాణకృతియగు కాదంబరి నాంధ్రీకరించెను.

ఇదిగాక నలుని పూర్వచరిత్రము నలవిలాసమను నాటకమును రచించెను.

పారి:- ఈయనకు నీగ్రంథనిర్మాణమున నాసక్తి యేల గలిగెను?

సూత్ర:- ముముక్షులకు నుపయోగించునటు లనాదిమల విమోచకమగు బ్రహ్మపథాది వేదాన్తగ్రంథజాతము నిర్మించిన విధమున బుభుక్షువులకు నుపయోగించునట్లు గలిమల నిర్మోచకమగు పుణ్యశ్లోకచరిత నిర్మాణ మావశ్యకమని తోఁచుటచే గలిగెను.

తే. నలుని దమయంతిఁ గర్కోటనాగవిభుని
వరుస ఋతుపర్ణ రాజర్షి వర్యుఁ దలఁపఁ
దూలజాలంబు సురగాలిఁ దూలునట్లు
కలివలనఁ గలుఁగు నిడుమలు దొలఁగు నిజము.

అని యిందు గౌతమముని పలికియుండెను. ఈ యర్థమును

శ్లో॥ కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్యచ
ఋతుపర్ణస్య రాజర్షేః స్మరణం కలినాశనం.

అను మహాభారత సంహిత వ్యక్తముఁ జేయుచున్నది.

పారి:- గీ. కవి ప్రసిద్ధుఁడు గాథయుఁ గలిహరణము
నటనమునయందు మనమతి పటుమతులము
సహృదయ జనాత్తశోభయు సభయు నిట్లు
గుణములన్నియు నొనఁగూడెఁ గొదవయేమి?

సూత్ర:- అభిరూపశేఖరుఁ డేమిచేయుచున్నాఁడు?

పారి:- (విచారగ్రస్తుఁడై యున్నాఁడు)

సూత్ర:- అయిన నిటకుఁ బిలువుము.

అభిరూపశేఖరుఁడు:- ప్రవేశించి

చ. అలసత నుజ్జగించి భరతాగమసాగరపారదర్శినై
 యిల గల కన్యలన్ వెదకి యీడితలక్షణలక్షితాంగయా
 కలికిని బెండ్లియాడి యిఁకఁగాంతు సుఖంబనియే దలంపఁగా
 గలివలె మమ్ము వేర్పరుపఁ గంటకుఁ డొక్కఁడు వెల్వడెంగటా.

ఇది ప్రస్తావన.

శ్రీ

శివాభ్యాంనమః

# నలప్రవాసము

# ప్రథమాంకము

(చింతాక్రాంతుఁడగు కలి ద్వాపరునితోఁ బ్రవేశించుచున్నాఁడు)

కలి:— సఖుఁడా! ఏమి యిది?

తే. గీ. ఇపుడు వైదర్భి వరియింప నేగు నాకు
నెడమవైపగు కనుబుజ మొఱరఁ దొడఁగె
కాకిదీర్చెను గరుడము గట్టె నిట్టు
లవశకునరాజిఁ గానఁగా నయ్యె నేమొ.

ద్వాప:— దుర్నిమిత్తము లిష్టప్రాప్తి నేగాక యనిష్టప్రాప్తినిఁ గూడ సూచించెడిని. కాన నిప్పుడు నిలిచి పదంపడి యేగు టుచితము.

కలి:— మిత్రుఁడా! క్షణమైన నిలువఁజాల. ఏమిసేయుదు.

తే. గీ. వినఁబడియె నేఁడె వరియించు దినమటంచు
క్షితిపతులు నెందఱో ముందె చేరియుంద్రు
నలుఁడు ముందుగ నచ్చోట నిలిచియుండు
వేగమున నిప్పు డచ్చోటి కేగవలయు.

తే. గీ. మనసు దమయంతి చింతాగ్ని మగ్నమయ్యె
శకున సంప్రేక్షణం బెట్లు సంభవించు
నేను గామించియుండిన యింతి నెట్లు
పరుఁడు గ్రహియించునో గాంతు భయము లేక.

(తెరలో)

తే. గీ పోదువో నీవునుం భీమపుత్రి కొఱకు
నాయె పెండిలి వచ్చితి మచటినుండి

కలి:— (విని రోషముతో) వీరెవ రిట్లు పలుకుచున్నారు. నన్ను బరిహాసింపనా లేక యిది నిజమే యగునా?

ద్వాప:- ఇది పలువురమాటగా నున్నది. కాన కంఠస్వరమునుబట్టి నిర్ణయింప వలనుగాదు. నెమ్మదిగఁ గడమ మాటయు నాలింతము.

(తిరిగి తెరలో)

నిపుణ యాకన్నె వరియించె నిషధపతిని
జ్యోత్స్నగాదునె యన్యుని సోమఁగాక.

కలి:- (విని క్రోధముతో) మీరెవ్వారలు? నన్నుడికింప నిట్లు పలుకుచున్నారా? లేక నిజమే చెప్పుచున్నారా?

(తెరలో)

ఛీ మూఢుఁడా! దిక్పాలురను గూడ నసత్యవాదులనుగ భావించు చున్నాఁడవు. నీచూపున కెల్లవారలు నినుబోలియే కనఁబడుదురు గావలయు పొమ్ము.

కలి:- (కొన్నియడుగులువైచి నిలిచి) మిత్రుఁడా! ఏమని పోవుదము. స్వయంవరమయిపోయెనని వీనులలోఁ బిడుగు వడియెఁగదా!

ద్వాప:- సఖుఁడా! ఇప్పుడు వెనుకకు మరలుటయే మేలని తలంచెదను.

కలి:- ఇటులందువేల? ఈ పనికిఁ దగిన ప్రతిక్రియసేయక నిలువఁగలనా? చూడుము.

తే. గీ. ఏను గామించుకన్నియ నితఁడుగొనియెఁ
గాన నీతని నదయతఁ గాంతతోడ
విరహితునెగాక విభవంబు వెడలఁజేసి
పరిభవించెదఁ గానలపాలుసేసి.

ద్వాప:- వీరు నీకేమి యపకారము సేసిరి? నీదురదృష్టతయే నీకు ద్రోహము గావించెను? ఏమన,

తే. గీ. క్షితిపతులు వేడ్క నెందఱో చేరిరటకు
నలుఁడు నున్నారివలెఁ బోయె లలితతనుఁడు

నాఁతి వరియించియుండును నలునె యందు
నిట్టి నీవార్త వారికి నేమి తెలియు.
ఇందు వారితప్పేమో చెప్పుము.

కలి:- సఖుఁడా క డచినసంగతి నీకుఁ దెలియదు. నలుఁడు దూతికలతో ముందుగనే దమయంతిచిత్తము నాయత్తముఁ జేసికొనెను.

ద్వాప:- అటులైనను

తే. గీ. నైషధుఁడు సర్వసద్గుణభూషణాఢ్యుఁ
డాడితప్పఁడు ధర్మంబుజాడ విడువఁ
డాయనకుఁ గీడు సేయ నాయత్తపడెదొ
చీఁకటి జయింపఁ గల్గునె చిత్రభాను.

ఈ యుద్యమమున నీవె భంగమొందుదువు గాన నుపరమింపుము.

కలి:- కనిపట్టియుండి సందు దొరకినప్పుడు ప్రవేశించి వశముసేసికొందును. ప్రవాహము రంధ్రము చిక్కగనె యోడను ముంపఁజాలుగదా! కావున సమయము వచ్చినప్పుడు పనితీర్చికొందము, రమ్ము. ఇపుడు స్వస్థానమునకుఁ బోవుదము.

(అని నిష్క్రమింతురు)

(నాయకుఁడు దమయంతితోఁ బ్రవేశించుచున్నాఁడు)

నాయ:- ప్రియా! ఊరడిలుము, ఊరడిలుము. తలిదండ్రుల వదలిపెట్టి వచ్చుటవలన గలుగు దుఃఖములే దుస్సహములు. ఇఁక భగవతి శారదాదేవివియోగమువలన గలుగు వానిఁగూర్చి యేమిచెప్పవలయు.

ఉ. ఏయమ బుజ్జగింపకయ యే దినముం భుజియింపనొల్లవో
యేయమ ప్రక్కబండకయ యే నిశయు న్నిదురింపకుందువో
యేయమ వెంపుచుండ నిఁక నేతఱినిన్ననని స్థలంపవో
యాయజురాణిఁ బాయుట లయాగ్నివలెం దహియింపకుండునే.

చెలులు:- ఇదియు నిజమే. ఇఁక నా దేవితొడమీఁద నే పండుకొని యుండు పిల్లలెట్లు లద్దేవిని మఱతురు.

దమ:- (కన్నీరుగార్చుచు నేడ్చుచున్నది)

నాయ:- ముద్దరాలా! శారదా దేవి యిపుడు వెడలినదని విచారపడ నేల? ఆ దేవి యింతదనుక నున్నదని సంతసపడరాదా?

చెలులు:- సఖీ! మఱచితివా. మున్నా దేవి నిన్ను పెనిమిటి యింటి కనిపి బైలుదేఱఁగానే మఱికొంతకాలముండి యనుగ్రహింపుమని మీతండ్రి ప్రణమిల్లి బ్రతిమాలి యద్దేవి నాపియుండెఁ గదా!

నాయ:- దేవికిఁగల్గిన శోకము రసాంతరముచేఁ దొలఁగింపవలయుఁ గాన నుద్యానవనము నలంకరింపుఁడు.

చెలులు:- దేవరయాజ్ఞ (అని పోవుదురు)

నాయ:- (దమయంతి చేయి పట్టుకొని యెదురఁ జూచుచు) నీవలెఁ గుపితురాలగు కోయిలనుఁ గనుము. మగకోయిల తలిరుటాకు ముక్కుతోఁ బట్టుకొని నోరిలో నిడుచున్నను నెంతమాత్రముఁ దొనకకయున్న కాంతను సేవింపను నోదార్పనుఁ దోఁపక నిలువఁబడియున్నది.

దమ:- ఇది నావలెఁ దెలివిలేనిదె. ప్రియుని వేగిరపాటుఁజూచి కోపము దిగవిడచెఁగదా. ఉద్యానవనమార్గముఁ జూపుఁడు.

నాయ:- ఇదియె యుద్యానమండపము. (అని దమయంతితోఁ బ్రవేశించి) ప్రియా! బడలితివి. అయిదాఱడుగులు నడువఁగానే నీపాదములు గందెను. నలుపఁబడిన పూఱెక్కలవలె నీ యంగములు వాడిపోయెను. నీమోముదమ్మి చెమ్మటఁ గ్రమ్మినది. కాన నాతొడమీఁదఁ దలనిడుకొని కొంచెముసేపు విశ్రమింపుము.

దమ:- (అట్లు పండుకొని) ఆర్యపుత్రుని యుత్సంగమునకు నొప్పి కలుఁగునేమో! అని లేచి యెడముగా బండుకొనఁబోవును.

నాయ:-

శా. అంగంబెయ్యది దాకుదో యది మదీయంబంచు భావింతునీ
యంగీకారముగన్న దే ప్రియముగానాసింతు నర్థంబు ని
న్నుంగాంచంగనుకాల మాయువుగ నెంతుఁ బక్వబింబోష్ఠి నీ
సాంగత్యంబున నే స్పృహావహముగుఁ సర్వంబు నాకెప్పుడుఁ.
కాన నాతొడమీఁదనే తలనిడుకొని పండుకొనుము.

దమ:- (పండుకొని) ఆర్యపుత్రుని మోముదమ్మి చక్కఁదనము నా చిత్తము నాకర్షించెను గాన నిదుర యెట్లు వచ్చును.

నాయ:- ప్రియంవదా! ప్రియాలాపములు వలదు. (అని ముంగురులు దువ్వుచుండును)

దమ:- (నిదుర నటించును)

నాయ:- (మోముదమ్మి నాఘ్రాణించుచు నాలింగనము సేయుచు) ము న్నీతలిరుఁబోణి దొరకనప్పు డిట్టి విభ్రాంతులఁ జిత్తమున నే యూహించుచు కాలము నెట్లు గడిపితినో.

దమ:- (కన్నులు దెఱచి గద్గదస్వరముతో) ఇల్లు పిల్లలనుగూడ వదలిపెట్టి నీ పాదకమలములె సేవించు నన్ను నట్టడవిలో వదలిపెట్టి యెటకుఁ బోయితివి.

నాయ:- (ఉద్వేగముతో) ఇల్లు, రాజ్యము మున్నగువానితోఁ బిల్లలతోఁగూడ వియోగమును నడవిలో మా యిరువుఱ విప్రయోగమునుగూడఁ జూచెను. ఒకప్పుడిదియు ఫలించునేమొ! (ఆలోచించి) అయ్యో! నేను తన్ను వదలిపెట్టినట్లు చూచినది. ఇదియెట్లు సంభవించును. ఏ నెప్పుడేని దమయంతిని విడుతునా? (నవ్వి) దీనింబట్టి కడమది యంతయుఁగూడ నసంభవమే యని తోఁచెడిని. ఐనను బ్రియురాలు దుస్స్వప్నమునుండి విరమించుఁగాక! [అని వ్రేలితోఁ గొట్టుచున్నాఁడు]

దమ:- (తొందరపడుచు లేచి) ఆర్యపుత్రా! నన్నెప్పుడును వదలి పెట్టకుము. ఇప్పుడీ దుస్స్వప్నము నాకు భయముఁగలిగించెను.

నాయ:- ప్రియా! యితరులకుఁ జెప్పనెడ దుస్స్వప్నదోషము తొలఁగునని చెప్పుదురు. నీకు మనసు నిబ్బరము లేమిచే నిట్టి కల వచ్చెను గాన నిది యేమియుఁ జేయఁ జాలదు.

(అని నిష్క్రమింతురు)

ఇది భారద్వాజసగోత్ర శ్రీ జ్వాలాంబికా ఘోరనాథా
రాధ్యపుత్ర బుధజనవిధేయ నాగలింగాభిధేయ
కృతి విశేషమగు నలప్రవాసము నందు
స్వప్నమను ప్రథమాంకము.

---

శ్రీ

శివాభ్యాంనమః

# నలప్రవాసము

## ద్వితీయాంకము

పుష్కరుఁడు ప్రవేశించును

పుష్క:- (తనలో) నిన్న కలిమహాత్ముఁడు నా యొద్దకు వచ్చి నల దాయాదా! పుష్కరా! ఏను పలునాళ్ళనుండి కనిపట్టి యుండి నేఁటికిఁ గృతార్థుండనైతిని. ఏలన, నలుఁడు శౌచవిధి యందుఁ బాదప్రక్షాళనము సేయునప్పుడు బొటనవ్రేల నొకచోఁ బొడియుండ నటనుండి యాయనయందుఁ బ్రవేశించి తిని. నీవు మునుపటియట్ల నలునివలన భయపడవలదు. జూద మున నేను పాచికలలో నుండి నిన్ను గెలిపింతును. కాన నీవు పోయి నలచక్రవర్తిని జూదమునకుఁ బిలిచి యాడుము. నిన్నిపుడె చక్రవర్తినిఁ గావింతునని శపథముసేసెను. నాకిఁక సందియమేమి? (ప్రకాశముగా) దౌవారికా! నారాక లోపలఁ దెలుపుము.

దౌవా:- మహాప్రభూ! పుష్కరుఁడు వచ్చి తనరాక దేవరకు విన్న వింపఁ గోరుచున్నాఁడు.

నాయ:- వాని నిటకుఁ దోడ్కొనిరమ్ము.

[దౌవారికుఁడు పుష్కరుని లోనఁ బ్రవేశపెట్టును.]

నాయ:- పుష్కరా! నీ విటకు వచ్చిన పనియేమి?

పుష్క:- జూదమాడనే.

నాయ:- జూదమును విద్వాంసులు, ధార్మికులు నంగీకరింతురా? ఇది గర్హితముగాన నంగీకరింపనోపను.

పుష్క:- అటులేని "జితోస్మి" యనుము. ఇందుఁ గష్టమేమి?

నాయ:- పుష్కరా! ఇపుడు నీకింత ధైర్యమెట్లువచ్చెను? కానిమ్ము. చూతము. మున్ను బాహుబలమున రుచి చూచితివి గదా. ఇపుడింద్రైన సామర్థ్యము నెటగ్రహించితివో గానిమ్ము. ప్రతీహారీ! పలక పాచికలు దెమ్ము.

ప్రతీహారి:- ఇదిగో పలక పాచికలు [అని అటనుంచును]

నాయ:- పుష్కరా! నీవేమి యొడ్డెదవు?

పుష్క:- ఏను దాస్యమే యొడ్డెదను. నీవేమి యొడ్డెదవు?

నాయ:- కాల్బలముల నొడ్డెదను.

పుష్క:- (నవ్వుచు) నేన గెలిచితిని.

నాయ:- [తిరిగి పాచికలఁ దీసికొనును]

పుష్క:- నీ వేమి యొడ్డెదవు.

నాయ:- నే నేనుఁగుల నొడ్డెదను. [అని పాచికలవైచును]

పుష్క:- నేన గెల్చితిని.

నాయ:- [తనలో ఆశ్చర్యముతో]

తే. గీ. ఒక్కచో వ్రేయ నక్షమింకొక్క చోటఁ
బడుచు నున్నది యిది పరాభవము గలుగ
సూచకంబుగ నాకిప్డు దోఁచె మదికి
విశ్వనాథుని యిచ్ఛ యే విధమొ యెఱుఁగ!

[ప్రకాశముగ] జూదమునందు మొదటఁ గలుగు నపజయము పదంపడి విజయమునె సూచించును. పుష్కరా! నీవు దాస్యమునే యొడ్డెదవు గదా!

[తొందరగా పౌరులు దగ్గఱకువచ్చి నమస్కరించి]

మహారాజా! ఇదియేమి ?

ఉ. కైతవరీత్యుపేతము జఘన్యగృహీత మధర్మభూతమున్
పాతితశారిహూత బహుపాతకజాతము శాస్త్రధూతముం
బ్రీతవిరోధిగీత మురరీకృత సర్వవిధార్తి దూతమౌ
ద్యూతము నీకుఁ గార్యముగఁ దోఁచెడి నెట్లు నృపేంద్రచంద్రమా.

ఉ. కాసును జేయనట్టి యొక కాపురుషుండిఁక ముందుఁజూడ మీ
మోసలఁ గెలుదోయిఁ దన మోమునఁదాలిచి నిల్చువాఁడు మీ
తో సరిగా నెదుర్కొనుచు ద్యూతమునాడుటకన్న నెక్కడో
మోసముగల్గునే నిజసమున్నతబుద్ధి విమర్శ మానుమా.

తే. గీ. భూప యిక్కట్టులకు నెల్లమూలమైన
మాయజూదంబు నాడుట న్యాయమయ్య
ధర్మరతివగు నీ కిది తగునటయ్య
మా యెడఁ బ్రసన్నమతి నిది మానుమయ్య.

నాయ:- (తిరస్కారభావముతో) పౌరులారా! ఇదంతయు నే నెఱుంగుదును. పోవుడు మీరు. (పౌరులు పోవుదురు)

అబ్బా! పిశాచములు పాఱిపోయినవి. వారి కలకలమున నాచిత్తము పరాయత్తమగుటచే నేన యోడితిని.

[త్వరపడుచు వచ్చిమంత్రులు]

తే. గీ. జూద మదియేడ నలుఁడిందుఁ జొచ్చుటేడ
పూర్వకర్మవశంబునఁ బురుషబుద్ధి
క్షణమునన మాఱుచుండునో గాకయున్న
నిట్టి విపరీతకృత్య మింకెట్లు గలుగు.

[ప్రకాశముగా] మహారాజా!

తే. గీ. ధర్మపరుఁడవు జనహిత తత్పరుఁడవు
హితము నహితంబు నీకన్న నెవ్వఁడెఱుఁగు
సచివవర్యులకే బోధ సలుపునట్టి
నీ కిపుడు నేము గఱపెడి నీతిగలదె.

ఉ. ఇష్టమె ధార్మిక వ్రతతికించినదే యిది విఘ్నకోటికిన్
శిష్టజనాళి కియ్యది నిషేవ్యమె యోగ్యమె చక్రవర్తికిన్
గష్టతరాష్ట కానయన కారణమంచు జగత్ప్రసిద్ధమౌ
దుష్ట దురోదరాద్రిదరి దూఱకు ధర్మపథావనోన్మనా.

మ. కలిగించున్ మది మైకమున్ నియతిఁ బోకార్చున్ యశోధర్మముల్
తొలఁగించుం గద రాజ్యలక్ష్మి మఱియుం దూలించు సత్యాదులన్
బలికించున్ వెసదబ్బరల్ దృఢగతిన్ వారించు విజ్ఞానమున్
దలపన్ బానముకన్నఁ దక్కువెటు జూదంబో నృపాలాగ్రణీ.

సీ. జూదమునన్ జోర జూదరి వారితో
సమత యెవ్వనికైన సంభవించు
నద్దాన లాఘవం బమరు లోకమునందుఁ
గలహ మల్పులతోడఁ గలుగుచుండు
నంతటఁ గొట్లాట లనయముఁ గల్గుట
వ్యవహార గృహ మెక్కవలసివచ్చు
శిక్ష యిద్దఱకందు సిద్ధమౌ నద్దాన
నపయశంబు జగంబు నావరించు.

తే. గీ. నీవిధంబున నిందకుఁ దావలంబు
కలిమి కుచ్చాటన క్రియా కారణంబు
కష్టరాజికి నిరుప మాకర్షకంబు
నైన జూదంబు వదలుమో యవనినాథ.

తే. గీ. తరతరంబులనుండి యోధరణినాథ
సచివ పదమున నుంటిమి సమ్మతముగఁ
గాన నిప్పుడు మామాట గారవించి
ప్రజలఁ గావింపు మానందపరవశులుగ.

నాయ:- [కోపముతో]

తే. గీ. క్రీడకై పాచికలఁ గొంచె మాడు నన్ను
దూలనాడెద రింతటఁ దొలఁగిపోవు
డింతమాత్ర మెఱుంగనె యేను మీరు
పిలువకయవచ్చి యూరక ప్రేలనేల.

మంత్రులు:-

ఆ. వె. సచివవరుల మాట రుచియింపకే భూపుఁ
డహితకార్యమందు నభిరతుఁడగు
నేతలేని నౌక నీరధిలోఁబడె
మునుఁగు నార్తి ఘోర వనధినతఁడు.

మేము పోవుచున్నాము. ఈశ్వరేచ్ఛ యెట్లుగలదో.

నాయ:- మంత్రులు తమ పాండిత్యమునంతను వెలార్చిపోయిరి.
పుష్క:- అవధానముతో నున్నాఁడవా? ఇప్పుడును నేనే గెల్చితిని.
నాయ:- [మగుడఁ బాచికలఁ దీసికొనును]
పుష్క:- ఇప్పుడేమి యొడ్డెదవో చెప్పుము.
నాయ:- భూమినొడ్డెదను.
పుష్క:- మహాత్మా! కలిదేవా! నిన్నుఁబోలిన దేవుఁడే లేడు.
[ప్రకాశముగా] ఇఁక భూమియే పణధనము.
నాయ:- సందియమేమి? ఇప్పుడును నీవే గెల్తువేని నప్పుడే ప్రియమైన భూమినంతను నీయఁగలను. [అని పాచికల వైచుచున్నాఁడు. అంతటఁ గన్నీరు గార్చుచు దమయంతి ప్రవేశించును.]

దమ:- ఆర్యపుత్రా! కడమసంపద యంతయుఁ బోయెనుగదా! సర్వముఁ దెలిసిన మీకిపు డిట్టియపస్మారమెట్లు సంభవించెను? ధార్మికుల రగుమీకు నధర్మాసక్తి యెట్లు వొడమెను? జూదమెట్టిదో తెలియదా, ఇది సకలవిభవమును నాశము సేయఁ బరమసాధనముగదా! ఇది కపటరూపమైనది గావున నేగదా దీనికిఁ గైతవమని పేరు గల్గినది. పాచికలు మీరొక్కచోఁ వేయ నవి వేరొక్కచోఁ బడుచుండుటఁ గనరైతిరె. పాచికలన దరిద్రలక్ష్మీకరగ్రహణ సాధనములు గదా! మీ రిప్పనియందుఁ బ్రవేశించి గౌరవమును, విభవమును, నగరమును, సామ్రాజ్యమునుగూడఁ బోగొట్టుకొంటిరి. ఇఁక భార్యనుగూడ నర్పింపఁ జూచుచుంటిరె! పోయినది పోనిండు. ఇంతనైన నిప్పని విడువుఁడు. పుష్కరుఁడిప్పుడు మిమ్మెంత తేలికగాఁ జూచుచున్నాఁడో గనుఁడు. మున్ను వీఁడు వాకిట నుండి దర్శనమునకు సమయముఁ దెల్పుఁడని దౌవారికులను వేఁడుచు వారు నిర్లక్ష్యము సేయఁగా వారిని బ్రతిమాలుచు సింహద్వారముప్రక్క నిలిచియుండువాఁడని వింటిని. ఇదంతయు జూదమునగు ప్రభావము. ఇంతనైన లేచి రండు. దంపతులము మనమిరువురము పిల్లలతోనైన మిగులుదము.

(అని గట్టిగా బట్టుకొని లేవఁదీయును)

నాయ:- (తనలో) ఇంత దిట్టతనముగలది పందెమునఁ దన్ను నుంచుటకు నంగీకరించునా? బాలురనుగూడ నొడ్డనీయదనియే తోచెడిని. ఆహా! స్త్రీ లెంత సాహసురాండ్రు. వారలెల్ల విషయములందును వ్యతిరేకభావనుతోస వర్తింతురుగదా! పోనిమ్ము. (ప్రకాశముగా) పుష్కరా! ఇఁక నేనే పణధనముగ నుండుదును. ఆడుము.

(తెరలో)

పౌరులు:- (కోపముతోఁ దిట్టుచు) అరే పుష్కరా! తొలుత మా మాట వినుము (అని బిగ్గరగా)

ఉ. ముష్కరవృత్తివై వెనుక ముందును గానక సర్వసంపదల్
దుష్కరణోపనీతమగు ద్యూతమునంగొని యింక దుష్టతా
విష్కరణంబునన్ నలుని వీడక దాసుని జేసెదేని నో
పుష్కరనీరరమును పూవుబలె న్నలిఁ జేయకుందుమే.

పుష్క:- (తనలో భయపడుచు) అబ్బో! పౌరులు చాలఁగఠినముగాఁ బలుకుచున్నారు. జూదమునఁ గెలిచినను వీరల వశము సేసికొనుట గష్టముగాఁ గనఁబడుచున్నది. కాఁబట్టి నలుని నింతటితో వదలిపెట్టుదును. (లేచి ప్రకాశముగా) మనుజులను బందెమున నునుచుట రాజులకు నుచితముగాదు. కాఁబట్టి లేచిపొమ్ము.

నాయ:- [తొందరగా లేచి పుష్కరుని పంచపట్టుకొని లాగుచు] పుష్కరా! పోవుచున్నాఁడవా? ఉండుము. ఇఁక నొక్కసారి నన్ను పణధనముగా నునిచికొని యాడుము. [అని గడ్డము చేతులు పట్టుకొని బ్రతిమాలుచుండును.]

దమ:- [కన్నీరుగార్చుచు దీనముగా] ఆర్యపుత్రా! మతిభ్రంశము గలిగెనా? లేక యిదియంతయు దురదృష్టనగు నా కర్మపరిపాకమువలనఁ గల్గెనా? కానిచో నిప్పుడు సర్వసంపదలు హరింపఁగా మీరునుగూడ దాస్యమున నుండఁగడంగుదురా! ఇది గొప్ప ప్రమాదము గానఁ గూడదు. [అని గట్టిగాఁ జేతులు పట్టుకొని లాగును.]

నాయ:- (కోపముతో) సాహసురాలా! నన్ను నిర్బంధింపకుము. దూరముగా పొమ్ము. [అని కాలితోఁ దన్ని లేచి] పుష్కరా! పుష్కరా! నామాట వినుము. ఒక్కమాటాడుము. [అని వాని పాదములమీదఁ బడును.]

దమ:- (మూర్ఛపోవును)

**పుష్క:**-(తనలో)ఇపుడేమిచేయుదును. (ఆలోచించినిశ్చయించుకొని)

తే. గీ. పాచికలనాఁడి సకల సంపదలఁ గొంటి
పూర్ణకాముఁడ గలిమహాపురుషు కరుణ
దాస్యమున వీరి నునిచిన దాననేమి
పొసఁగు నింక యథేచ్ఛగాఁ బోవనిమ్ము.

(ప్రకాశముగా కోపముతో) నన్ను బాధింపకుము. ప్రొద్దునెత్తి మీఁదికి వచ్చినదియుఁ గనఁబడలేదా! మధ్యాహ్న సంధ్యా కాల మతిక్రమించుచున్నది. (అని విదుల్చుచు త్వరగా లేచి పోవును.)

**నాయ:**- పుష్కరా! పుష్కరా! ఎటకుఁ బోయెదవు. ఒక్కసారి యాడుదము రమ్ము (అని తొందరగాఁ బోవును.)

**దమ:**- (మూర్ఛఁదేఱి) ఆర్యపుత్రా! మీ కాలిత స్నిపామరురాలికి దుర్లభమైనది. ఇంతనైన నను గ్రహింపుఁడు. కట్టుపుట్టము లతో మాత్రము మిగిలిన మనకు నింకను జూదమున నభిలాష యెందులకు? ఏదేని నడవిలోనైన నుండుదము రండు. (అని చేతులతో లాఁగుచుండును.)

**నాయ:**- (నిలుచుండి ఆశ్చర్యముతో తనలో) దమయంతి నన్ను లాగు చున్నది. ఈపె సఖురాండ్రులేకయే యొంటిగా నాస్థానమున కెట్లు వచ్చెను. (ప్రకాశముగా) ప్రియురాలా! నీ విచ్చటికేల వచ్చితివి, నన్నే లాగుచున్నదాన వేల. అడవిలో నేల యుండవలసివచ్చెను. చెప్పుము.

**దమ:**- (ఆశ్చర్యముతోను దుఃఖముతోను కన్నీరు గార్చుచు దీనముగా రాజువంకఁ జూచుచు) ఆర్యపుత్రా! ఇట్లడిగెదరేమి? ఇంతదనుక మీరెక్కడ నుంటిరి. పాచికల యాటతో సమస్తమగు సంపదయు హరించెఁ గదా! ఏను పిల్లలు మీరు మాత్రమె మిగిలితిమి! మీరు మిగిలినవారిని గూడ నెదిరి

కర్పింపగడఁగుచుండఁగా నే నొంటరిగానే యాస్థానమునకు వచ్చి మీావలనఁ గాలితన్నుల దినుటయేగాక, కోపోద్రేకమున వెడలు పెళుసుమాటలు గూడ వినియు ముహూర్తకాలమునుండి యిట్లే మిమ్ములాగుచు, బడుచు, సొమ్మసిల్లుచుఁ, దేఱఁగానే వచ్చి లాగుచుంటిని. జరిగినదంతయు మీాకు స్వప్నమా! చిత్తభ్రమమా! మనమిపుడు కట్టు పంచెలతో మాత్రమే మిగిలితిమిగదా! అని (యేడ్చును)

నాయ:- (ఆశ్చర్యముతోను దుఃఖముతోను తనలో) నాకుఁ దెలియకుండఁగనే యింతపని యాయెనా! నాకు నింత చిత్తవిభ్రమము గలిఁగెనా, ఇది యంతయు నీశ్వరేచ్ఛ గావలయు (ప్రకాశముగా) ప్రియా! నగరముగూడఁ బోయెనా?

దమ:- (కన్నీరు గార్చుచు) ఆర్యపుత్రా! పురజనులు వచ్చి మొఱవెట్టుచున్నను, మంత్రివర్యులు వచ్చి బ్రతిమాలు చున్నను, నే నడ్డగించుచున్నను భూమినంతను నర్పించితిరి. మన మిద్దఱము మాత్రమె మిగిలితిమని విన్నవించు చుంటిని.

నాయ:- అంతయుఁ దెలిసెను. ఇపుడు విచారింప నేమి? (తనలో) ఇపుడేమి చేయవలయు. (కొంచె మాలోచించి నిశ్చయించుకొని, ప్రకాశముగా) ఇప్పుడు చలింపఁ గూడదు.

మ. కలనేఁ జాగ్రత భ్రాంతినే నొకఁడె వాగ్దత్తం బగుఁ దత్తమే
తలఁపఁ గూడునె నోర వెల్వడునుడిం దప్పింప నా కెప్పుడుఁ
జలజాతాక్షి వచించినట్టు లటవీసంవాస మాశాస్యమా
నళికంబం దగు వ్రాలు దప్పకొన శక్యంబౌ న యెవ్వానికిఁ.

ప్రియా! ఏ నడవికిఁబోయెదను, నీకును గష్టమేల, నీవు బాలురతోఁ దండ్రి యింటికిఁ బొమ్ము.

దమ:- (ఏడ్చుచు) ఆర్యపుత్రా! బాధపడు నాతలమీాదఁ బిడుగువైచెదరేల. నేను మిమ్ము విడిచి యొక్కయడుగైనఁ బెట్టఁ

జాలను. ఒక నిమిషమైన మీ పాదకమలముల పరిచర్యమాని నిలువఁ జాలను. ప్రాణనాథుని వదలిపెట్టి పుట్టింట నుండఁగ సుఖము గలుగునా? కాంతకుఁ బ్రాణేశుఁడే సకలబంధువులు గదా. (అని గట్టిగాఁ గౌఁగిలించు కొనును)

నాయ:- (దుఃఖముతో తనలో) నన్నుఁ బ్రియురాలుగూడ వెంబడించు చున్నది. ఏమి సేయుదు —

తే. గీ. విభవజాతము సంతను విడిచిపెట్టి
యడవి కేగుదు వేఱుపాయంబు లేక
విధివశంబున నాకది విహితమయ్యెఁ
జేడియంగూడఁ గానకుఁ జేర్ప నేల.

(ప్రకాశముగా)

తే. గీ. పదవి తొలఁగుట యడవిని బాధపడుట,
రెండు విధముల దుఃఖమే యుండనిమ్ము
సుదతి కష్టము నెంతయుఁ జూడలేని
మూఁడవది యగు దుఃఖమమూఁడ నీకు.

అదిగాక,

తే. గీ. పట్టు తలగడ గల పూవుపాన్పునందుఁ
బండుకొని సౌధమున సుఖముండు నీవు
కంటకాకీర్ణమై యుండు కానలోన
నిర్భయంబుగ నేగతి నిలునఁ గలవు.

తే. గీ. వేణు వీణాశ్రవణ ముఖ్యవిధుల చేతఁ
గాలమంతయు లీలతోఁ గడపు నిన్ను
క్రూరమృగరావ భుజగాది ఘోరమైన
గహనమునకెట్లు గొంపోదుఁ గరుణలేక.

దమ:- సకలధర్మములు దెలిసియు మీ రిట్లు నుడివెద రేల ?

తే. గీ. విభుని విడనాడి జనకుని వేశ్మమందుఁ
బడఁతి యెల్ల సుఖంబులఁ బడయుకంటెఁ
దనవిభుని పాదయుగ్మమే యనుసరించి
యనశనంబుగ నడవిని మనుట మేలు.

నాయ:- ప్రియురాలా! హితము సెప్పిన వినవైతివి. అడవిలో నీగతి యేమగునో నే నెఱుఁగను.

తే. గీ. కత్తిరాల్ పిట్టగడ్డలు గలుఁగు నేల
నడువఁగాఁ గందినట్టి నీ యడుగుదోయి
నుద్ధృతంబుగ వెడలు నీ యూర్పుగముల
నువిద గాంచుచు నే నెట్టు లోర్చువాఁడ.

ఉ. మండెడు వేసఁగిన్ దవసమన్వితమై సెగలీను కానలో
నెండకుఁ గాలికోరువక యేడ్చెడు బాలుర బుజ్జగింప లే
కుండి నితాంత దుఃఖమున నుస్సురలాడెడు నిన్నుఁజూచి నా
గుండియ యెట్టులోర్చెడినిఁ గోమలి యేగుము తండ్రి వీటికిన్.

ఉ. భూపతిమాత్రుఁ డొక్కఁడు విమూఢతచే నిజరాజ్యహీనుఁడై
యేపగిదిన్ బురస్థితి సహింపకఁ గానకుబోవుఁ గాక యా
పాపుఁడు గాంతతో నెటుల బాలురనున్ గొనిపోయె నా జనా
క్షేపము నెట్టులోర్వఁగల జేడియ యేగుము తండ్రివీటికిన్.

తే. గీ. తరుణి నినుఁగూడియుంట కాంతారసీమ
నెట్లు జూచిన నా మదికించదయ్యె
గాన బాలురఁగూడి యో కమలనయన
తండ్రియింటికి నిశ్శంకఁ దరలిపొమ్మ.

దమ:- (గద్గదస్వరముతో) మీకుఁ దోఁచినట్లు కానిండు,

ఉ. కాంత పరిత్యజించి ననుఁ గానకుఁ బోయెదవేని నట్లు పో
మ్మంతకసూదనుండు కరుణాన్వితుఁడై మిముఁ బ్రోవుగాత య
త్యంత యశంబు మీకు భువనాంతరసీమల నిల్చుగాత నా
కింతియచాలు భాగ్య మిఁక నెక్కున యెట్లగు నల్పపుణ్యకున్.

(కన్నీరు గార్చుచు నుండును.)

నాయ:- (తనలో) వదలిపెట్టిపోవు పక్షమున నిజముగా నవసానోద్యమము నే సూచించెడినిఁ గాన రానిమ్ము, [ప్రకాశముగా] ప్రియురాలా! నామాట వినవైతివి, పిల్లలనైన విదర్భల కనుపుము.

దమ:- [సంతసముతో] ఆర్యపుత్రా! అనుగ్రహించితిరి. పిల్లల నిప్పుడే యనుపుదును.

[తెరలో గద్గద స్వరముతో]

అమ్మా! మమ్ము వదలిపెట్టి యెటకుఁ బోయెదవు.

నల దమయంతులు:- [దుఃఖముతో] పిల్లలమాటవలెనున్నది. వీరలఁ జూచి యూఱడించి వదలిపెట్టి యెట్లు తిరిగి చూడకుండ వెళ్లుదము. అయ్యో! యేదియుఁ దోఁపకున్నది.

[వార్ష్ణేయుఁడు పిల్లలతోఁ బ్రవేశించి దగ్గఱకు వచ్చి నమస్కరించి కన్నీరు గార్చుచు] పిల్లలను జూడుఁడు.

ఉ॥ మేదిని నిద్ధకీర్తులగు మీవలనం భృతిగాంచి యింతటన్
జూదమునన్ సిరింగోనిన శుంఠుని సేవన మాకుఁ జెల్లునే
కాదని పోదు నేను నధికారులు నెల్లరు నట్లు యింక నా
మీదట మంచికాలమున మీదటిఁ జేరుదు మెల్లవారమున్.

నాయ:- అట్టి దురాశ దేనికి, ఇది కేవలము నిరాశగా వదలిపెట్టి పోవుటయే గదా! ఏలన—

చం. మరలుట యేగతిం గలుగు మానక నిష్కపటంపు బుద్ధితోఁ
సిరుల నొసంగినాఁడ నవి చేకొనుమార్గము లేదు శూరతన్
దిరిగి గ్రహింపఁ బాలుపడఁదీఅదు దత్తముఁగొన్ననింద యీ
శ్వరుకృప నేమిగల్గినను సైపకతప్పునె యెంతవానికిన్.

దమ:- [కన్నీరు గార్చుచు] బిడ్డలారా! ఈ దుర్భాగురాలినిఁ జూచి నది చాలు. మీరు పోవుఁడు. [అని మూర్ఛపోవును]

పిల్లలు:- [దగ్గఱకు వచ్చి కన్నీరు గార్చుచు] అమ్మా! నీవు క్రిందఁ బడి యేడ్చుచున్నదాన వేల? [అని మీఁదఁబడి యేడ్చుచుందురు.]

నాయ:- [తనలో] అబ్బా! ఈ సమయ మోర్వరానిదిగా నున్నది యైన నెట్లో తల్లి నోదార్చి పిల్లల నంపుదును. [ప్రకాశముగా చెవిలో] ప్రియా! ఊఱడిలుము. ఊఱడిలుము. నీవే యిట్లు లేడ్చునెడ పిల్లలెట్లు మనమాట నమ్మి పోవుదురు. [పిల్లలనుఁ జూచి] బాలులారా! మీ యమ్మ యేడ్చుటలేదు. ఇది నవ్వులాటలకె యగు.

దమ:- బాలులారా! నేనేడ్చుటలేదు, నమ్ముఁడు.

పిల్లలు:- అమ్మా! నీవు నాన్నగారితో నెటకో పోవు నట్లున్నది మమ్ములఁగూడఁ గొనిపొమ్ము. [అని యేడ్చు చున్నారు]

ఇద్దఱును:- (కన్నీరుఁ గార్చుచు) బిడ్డలారా! మిమ్ము వదలిపెట్టి మే మెక్కడికి పోవుదుమో. మా గతి యేమో (అని తల లాఘ్రాణింతురు)

వార్ష్ణేయుఁడు:- జీతము తీసికొని బ్రదుకు నాకే దేశత్యాగము దుఃఖ కరముగ నున్నది. ఇఁక చిలకాలమునుండి పరిపాలించిన

మీకు నెట్లుండవలయు. ఇపుడు మీ వద్ద నిలువఁ జాలక యున్నాఁడను.

ఉ. తల్లిరో! యెందుఁబోదు వని తాళక యెక్కడలిర్వ నేడ్చు నీ
పిల్లల నెట్టులైన మఱపించి వనంబున కేఁగఁజూచు మి
మ్మల్లనఁ జూచెనేనిఁ గఠినాత్మ శిఖామణి యైనదక్షిణా
వల్లభునుల్ల మైన వగవాగునఁ దోఁగుచుఁ దల్లడిల్లదే.

నాకు సెలవొసంగుఁడు.

నాయ:- సరియే. బాలురను విదర్భదేశమునకుఁ గొనిపొమ్ము. (అని పిల్లలఁ జూపును)

వార్ష్ణే:- దేవర యాజ్ఞ.

దమ:- (కన్నీరుబిగఁబట్టుకొని) బిడ్డలారా! మీరు వీనితోఁబోవుఁడు. మే మిరువురము నొకదుర్గమునకుఁ బోవలసివచ్చెను. త్వరగా తిరిగి వత్తుము.

పిల్లలు:- అమ్మా! మమ్ముఁగూడ నటకుఁ గొనిపొమ్ము, మేమును వచ్చెదము. (అని యేడ్చెదరు)

ఇద్దఱును:- అయ్యో! మనకెంత గతి వచ్చినది. (అనిదుఃఖనిరోధము నటింతురు.)

దమ:- బాలులారా! అచ్చట పెద్దపులులున్నవి. కాన మీరు రాఁ గూడదు. వార్ష్ణేయునితోఁ బోవుఁడు.

పిల్లలు:- అమ్మా! మీరు వచ్చునపుడు పండ్లుతీసికొని వచ్చెదరా?

ఇద్దఱును:- అన్నిపండ్లు తీసికొని రాఁగలము.

వార్ష్ణే:- (పిల్లలతో వెడలిపోవును)

దమ:- (పిల్లలను గన్నీరుగార్చుచు చూచి) ఆర్యపుత్రా! ఇంకను నిక్కడ దేనికి, మనమును బోవుదము.

నాయ:- (దమయంతి చేయిఁబట్టుకొని దుఃఖముతో)

చ॥ జననమహీస్థలీ శరణుసల్పితిఁ గొమ్మ వనమ్ము వోవఁగా
ననుమతి సేయుఁడీ ప్రకృతులార ప్రణామము రాజ్యలక్ష్మికో
జనతతులార నిల్వఁడు విచారముఁ దక్కుఁడు మిత్రులార యీ
తనయులఁగూడఁ బోవిడిచి తల్లితిఁ జుట్టములార యుండుఁడీ.

(దమయంతినిఁ జూచి) ప్రియురాలా! నామాట వినవైతివి.

తే. గీ. అతివ హఠమున వెంబడించితివి నన్ను
దైవమే నిన్ను నెట్టులో గావవలయు
ప్రాణమైనఁ దృణంబుగ వదలువాఁడఁ
గాని ధర్మము నెప్పుడు మానఁజాల.

(అని నిష్క్రమింతురు.)

ఇది భారద్వాజసగోత్ర శ్రీ జ్వాలాంబికా ఘోరనాథా
రాధ్యపుత్ర బుధజనవిధేయ నాగలింగాభిధేయ
కృతి విశేషమగు నలప్రవాసము నందు
ద్వ్యాతమను ద్వితీయాంకము.

శ్రీ

శివాభ్యాంనమః

# నలప్రవాసము

## తృతీయాంకము

(సంతసము తొందర నటించుచుఁ గలి ప్రవేశించుచున్నాఁడు)

**కలి:—** ఆహా! చాలకాలమునకు నా కోరిక పూచెను, ఎటులన,

తే. గీ. జూదమున సర్వవిభవవిచ్యుతులఁ జేసి,
వీరి ననిచితి ఘోరకాంతారమునకు
విడువకింతట నిద్దఱ వేరుజేసి
ముంపఁగావలె శోకసముద్రమందు.

నలుని కట్టుపుట్టముఁగూడ పక్షులచే హరింపఁజేసి యిద్దఱ నేకవస్త్రధారులఁ గావించితి. అడవియంతయుఁ బిట్టిగడ్డలతోఁ గత్తిరాళ్లతో ముండ్లకంచెలతోను నింపితిని. వారిని వెంబడించియే యుండవలయు (అని నడచి యెదురఁజూచి) అదిగో! ఇచ్చటనే యున్నారు.

ఉ. స్థండిలమందు నిద్రగొను సాధ్విఁజూచుచు జీర్ణమాలతా
మండపమందు నుత్కటతమంబున మేల్కనియున్న సర్వభూ
మండలనాథుఁ గానఁగనె మానసమెంతయుఁ దీవ్రమౌ వ్యథన్
ఖండితమై కలంగెడిని నాకునుఁ ద్రిమ్మట వెట్టువానికిన్.

(ఆలోచించి) అట్లుగాదు. ఇది పగఁదీర్చికొనుటగాన మనము కనికరింపఁగూడదు. ఏలన,

తే. గీ. స్వార్థపరుఁడైన మానవర్యుఁ డెందు
రిపుల కష్టములకు విచారింప నగునె
యెండి తేలికగా నుండు నింధనముల
వీతిహోత్రుఁడు బూది గావించుఁగాదె.

కావున నిటనేయుండి వీనులు దనియునట్లు వీరి దీనాలాపముల నాలించుదునుగాక. (అని పొంచియుండును)

నాయ:- (కన్నులుదెఱచి నలువైపులఁజూచి) ఏమి యీ కాఱుచీఁకటి? నా దౌర్భాగ్యమువోలె నెల్లదిక్కులఁ గప్పుచుఁ బ్రోగైనది.

ఉ. ఒక్కఁడె నల్పుగా నిలిచియున్నది చూడ నరణ్యమెల్ల వే
రొక్కటి గానరాదు తమమొప్పెడి నెక్కడ నెందుఁజూడ న
ల్దిక్కుల మిఱ్ఱుపల్లములు లేక సమంబుగఁ జూపుచున్నదై
యక్కట నాగలోకపుగుహం దలపించెడి నిద్దియెంతయున్.

మఱియు,

తే. గీ. ఖగములాకూయుచున్న వఖండముగను
క్రూరమృగజాతు లఱచెడి ఘోరముగను
భుజఁగములు దిరుగుచున్నవి బుస్సు మనుచుఁ
గాననం బిద్ది యమదేవతాననంబు

ఉ. ఆసకలావనీవలయ మానిషధంబుల నాపురీవరం
బాసుతులన్ భటవ్రజము నావిభవాతిశయంబు నంతనున్
బాసి తరక్షురుక్షశరభప్రముఖాయన మావనమ్మునం
దీసతి నొక్కతం గనుచు నిస్సిరొ పుచ్చుచునుంటి రాత్రులన్.

చం. కనకమయాసనంబున సుఖంబుననుండి మహీశు లెల్లరున్
నను మునుగొల్వఁగా నుపవనంబున వేణుమృదంగగీతని
స్వనరసమాధురీవశత సమ్మదముబ్బగనుండువాఁడ ని
వ్వని మృగమధ్యమందునఁ బవళ్ళను బుచ్చుచునుంటి నక్కటా.

చ. కపురము గల్పవల్పు సిరిగందము మేన నలంది సింహాతూ
లపుతలిమంబునన్మను విలాసమునన్ బ్రవళించు వారమే
యిపుడు వనాధ్వధూళి తను వెల్లెడఁ గప్ప శరారుఘోరమా
విపినమునందు ముండ్లపొద విశ్రమమొందుచునుంటి మెంతయున్.

(దమయంతిచేయి దాకుచు)

ఉ. పుట్టితివీవు శ్రీవసతిభూపతి వేశ్మమునందు బెంపునం
బట్టితి సార్వభౌముకరపద్మము గావున భాగ్యయుక్తవే
యట్టులయైన నిద్ది యసురారితిరస్కృతిగల్గె నట్లుగా
దిట్టి యభాగ్యఁ గాదనక యేకటఁగూడు ఫలంబగున్ జుమీ.

చ. మగువరొ నీపదాంబుజము మానని నీపొలయల్కఁ జేతితోఁ
దగిలినఁ దోచెఁగా మునుపు దాఁకనియట్టులె కత్తిరాళ్ళచేఁ
బగిలియు నెత్తురొల్కుచు నవశ్యము నామదికిప్పు డెంతయో
వగనెగఁద్రోయుచున్నది యవారణఁ జూచుచు నెట్టులోర్చుదున్

మఱియు,

ఉ. కాంతరొ నీదుమేను రవికాంతినెఱుంగమి దీప్తిమంతమై
సంతమసంబునందునను సంతసమున్ మునుగూర్చె నిప్పుడ
శ్రాంతము నెండతాఁకుగని చాయదొఱంగియుఁ గందిపోయి నా
స్వాంతము తీవ్రశోకమున సంతమసంబున ముంచుచుండెడిన్.

చ. తనయ వసుంధరాపతికి ధర్మసతీమణి చక్రవర్తికిన్
జని వనసీమలంగుడిచెఁ జాలశ్రమంబులఁ బూర్వకాలమం
దనుచు నొకండువల్క వినునట్టిజనుండె తపించు నట్టిచోఁ
గనుచునె యెట్లుగట్టెదురఁ గాంతరొ యోర్చుదు నీప్రయాసముల్

(ఆలోచించి నిశ్చయించుకొని తనలో)

తే. గీ. ఇంతితోఁగూడి యెడరు సహించుకంటె
విడిచిపోవుట యిపుడు వివేకపథము

పరఁగ నెల్లపుడుండెడి బాధకంటె
నొక్కపటిఁ గల్గు కష్టమె యుక్తముగద.

(విమర్శించుచు) అంగనాజన పరిత్యాగము గొప్ప పాతకము-
గాదా! (అని యాలోచించుచుండును)

కలి:- (సంతసముతోఁ దనలో ఇదియే నా కనుకూలమైన యదను.
కాఁబట్టి యేను దగ్గఱఁజేరి ధర్మచింత లేకుండఁ జేసెదను.

తే. గీ. దగ్గఱకుఁ జేరఁగా నేను ధర్మచింత
జనులకెటు నిల్చియుండును జగమునందు
వ్యాఘ్రమునకు నివాసమౌ వనమునందుఁ
బసి వసింపఁ గడంగునె భయము దక్కి.

(అని సమీపించును)

నాయ:- ఈపని పాప మనుట యెట్లు? ఆలోచింప నిది పెద్దపుణ్య-
కార్యమే!

తే. గీ. కానలో సంభవించెడి కష్టములను
గనక పుట్టింట సౌఖ్యంబు గానఁ గలదు
విడువ కెంతయు ననుఁజాల వెదకి యేనిఁ
జివర కేనియుఁ బుట్టిల్లు సేరకున్నె.

నిదురించు చున్నదిగాన వదలిపోవ నిదియ యుక్తసమయము.

ఉ. భూతములార దండమిదె ప్రోవుఁడు మీదటిఁ గాంతనుంచితిన్
నాతినిఁ రక్షసేయుఁడు వనస్థిత దైవతకాంతలార మీ
రీ తనుమధ్యయందయిన నేర్పడ సౌమ్యతఁజూపు మోవిధీ
ఘాతుకవృత్తిఁగాదుసుమి కాంతనుఁ జూడనెలేక వీడుదున్..

కలి:- (సంతసముతో) ఆహా! కృతార్థుఁడనైతి. (అని నృత్యము
చేయును)

నాయ:- (పోఁదలంచి పంచెలాగుట నభినయించి సందేహముతో)
ఇది యేమి?

తే. గీ. దైవమెంతయొ క్రూర స్వభావ మయ్యు
మా వియోగంబునందు సమ్మతినిఁ గొనదొ
యిద్దఱనుగూడ బాధింప నిశ్చయించి
యిట్లు వారించుచున్నదో యెఱుఁగ రాదు.

(వితర్కముతో)

తే. గీ. ఈపనికి భూతజాతము లిష్టపడవొ
దయితయే మేలుకొనియెనో తాళకింతి
ప్రేమయె నన్ను నిట్లు వారించెనొక్కొ-

(స్మరణము నభినయించి)

అట్లుగా దేకవస్త్రుల మగుదుమేము.

(మఱలిచూచి)

తే. గీ. ఎట్లుచింపుదు నీచీర నిప్పుడహహ
యొడలుమాత్రమ శేషించి యున్నవాఁడ

(ఆలోచించి నిందాభావముతో) హా! ఛీ! ఏమిబ్రదుకు?

విభవములనెల్ల నూరక విడిచినాఁడఁ
జూడుమా విడుచుచున్నాఁడ సుదతిఁగూడ.

తే. గీ. ప్రాణమా విను నీవెంత వజ్రకఠిన
వొంటిగానుండఁ దలఁచెద వోటుదక్కి-

అయిన నదియెట్లు పోసఁగు?

అకట శేషించియుండ దుఃఖానుభవము
విడిచిపోవను నాకెట్లు వీలు గలుఁగు.

తే. గీ. గహన మియ్యది జనగతిరహితమైన
గట్టుపం చెయు లేకెట్లు గదలువాఁడఁ
దప్ప కేదైన నీశ్వరు తలఁపు లేక
పురుషయత్నంబువల్ల నే పొందఁబడు నే.

(వేడినిట్టూర్పు విడుచుచు మరలఁ గూర్చుండుచున్నాఁడు)

కలి:- ఉపకరణము లేకపోవుటయే యితఁడు భార్యను వదలిపోవుటకు నాటంకముగాఁ గనఁబడుచున్నది. కాన నిచ్చటఁ గత్తిఁ బడఁ వేయుదును. (అని యట్లు చేయును)

నాయ:- (చప్పుడు విని ఆశ్చర్యముతో) ఎట్లిచ్చట నినుమువడిన చప్పుడు విననయ్యెను. కాఁబట్టి చూడవలయు. (చేతితో నేల వెదకుట నభినయించి కత్తితీసికొని) ఔరా ? ఇది యినుప కత్తియే. (సందేహముతో) ఎవఁడిచ్చటఁ గత్తిఁ బడవై చెను.

ఉ. రక్కసుఁ డెవ్వఁడేని నచిరంబుగ బంప ననుం గడంగెనో
నిక్కమ యట్లుగాదు మఱి నిష్ఠురదైవము సాహ్య మిచ్చుచుణ్
దక్కక మమ్మ వేర్పఱుప దత్పరమై పడవ్రేసెఁ గానిచో
జిక్కనె కత్తి భైమి దగు చీరను జింపఁగఁ శూన్య మావనిణ్.

కానిమ్ము. అట్లు గాకున్నను దైవరహస్యములు దెలిసికొన శక్యములు గావు. కావున దీనితోఁ బ్రియురాలి చీర చింపు దునుగాక ! (అని యట్లు చేయుచున్నాఁడు)

కలి:- అరే ! మంచిపని చేసితివి. ఇప్పనితో నీ సౌభాగ్యమద మంతయూ నడఁగినది గదా !

నాయ:- (ఆ త్రుంపుఁ గట్టుకొని దమయంతిని ముద్దు వెట్టుకొని)

తే. గీ. వనిత నీ వదనస్పర్శ యనుమతి యగు
పోవుచున్నాఁడ సుఖనిద్రబోవు తన్వి !

ఈవు మరణింపఁగా నిశ్చయింపఁ బోకు
పుణ్యమే నీకు నుండుచోఁ బొందఁగలము.

(కన్నీరు గార్చుచు లేచి నలుదెసలు చూచి) నీటిలో మునిం
గిన వానికిఁబోలెఁ జీఁకటిలో నున్న నా కేమియుఁ గానరాదు.
ఇపుడు దారియైన నెట్లు తెలియును. (అని కూర్చుండి తనలో)

చ. నరుఁడు చరింపనట్టి గహనంబునఁ దానశరణ్యయై కృశో
దరి విడనాడి నాఁడనని తాల్పకు కోపము నీ ప్రయాసముల్
దెరలుపనే యిటు ల్బయలుదేఱితిఁ గావున మద్వియోగ సం
జ్వరమునఁగల్గుశోకమును బాలురమోములుసూచి యోర్వవే.

మఱియు

ఉ. జూదముగూడదన్న శ్రుతిచోదిత మేలగణింప నైతినో
కాదని నీవు మంత్రులును గట్టిగఁ జెప్ప వినంగ నైతినో
వేఁదుఱువృత్తి నిన్ను వనవీధులఁ బస్తులమాడ్చి యుంటినో
యీ దురితంబు లన్ని ఫలియించె వియోగముగా సతీమణీ.

అధికముగాఁ జెప్పనేల ?

తే. గీ. ఇపుడు నిన్నేల విడనాడి యేగితినన
నా లలాటంబు లేఖ యీలీలఁ గలదు
వేగమునఁ దండ్రిగృహమున కేగు మబల
యెవనిభాగ్యంబు వానిదే యవునుగాదె.

(కన్నీరు బిగఁబట్టుకొని తనముఖము ప్రియురాలి ముఖమునఁ
గొంచెము సేపుంచి కొంతతడవు గదలకుండి నిట్టూర్పువిడిచి)
ఇఁక నాలస్యము సేయఁ గూడదు. విచారపడిన లాభము లేదు.
త్వరఁగా బయలుదేఱెదను. (అనిలేచును)

కలి:- నేను మెఱుపువోలెఁ గొంత వెలుతురుగల్గించి యితని ప్రయా
ణమునకుఁ దోడ్పాటుఁ గావింతుఁగాక !

నాయ:- (లేచి నలువైపులం జూచి) అదృష్టవశమున మెఱుపువోలె నొకానొక వెలుతురు గానవచ్చుచున్నది.

తే. గీ. వెడలుటకుఁ దోడుగా వచ్చె వెల్తు రిపుడు
చీరఁ జింపఁగఁ బడెఁ గత్తి చెంత నపుడు
విపదమున కిద్ది యుత్పాతవిధమొ యేమొ
వచ్చినను నాకుఁ గష్టముల్ వలదు సతికి.

ప్రియురాలు నిదురించు వేళ ముగిసినది గాన నిఁక నాలస్యము సేయఁ గూడదు. (మెల్లగా నడిచి కన్నీరు కార్చుచు మరలి ప్రియురాలి నుద్దేశించి) ప్రియా! పోవుచున్నాఁడ నాకనుజ్ఞ యిమ్ము మందభాగ్యునిగతి యే మగునో.

చ. విడు మని నెట్టుచుండె విధి వీఁగదు డెందము రాకపోకలన్
దడఁబడుచుండెఁ బాదములు దాటుదు నేగతి నిన్నుఁగూడి యీ
యడవి నిసర్గదృ జించి విరహానలతాపము నెట్టు లోర్చుదున్
నడుచుదు నెట్టకేలకు వనంబున నుండకు పొమ్ము వీటికిన్.

(అభ్యర్థనముతో)

ఉ. సేమముతో సుఖాగమనసిద్ధికినై ముదమార నొప్పుమీ

(నిందతో)

బాములు నాకు సౌఖ్యములు వర్తిలు గావుత నీకు నెల్లెడన్

(భక్తితో)

సోమకళావతంస కృపఁ జూచుచు సాధ్విని బ్రోవు చుండుమీ

(దోసిలియొగ్గి)

హైమవతీ యనాథజన తావనదీక్షను జూపు మాయెడన్.

తే. గీ. చరణములు ముందునకుఁ బోవ సాగవిపుడు
పాడు డెందము స్థైర్యముఁ బడయనేర

దువిద నిను వీడి యొంటిమై నుండఁజాల
నట్టులైనను నెవ్వఁడో నెట్టుచుండె.

తే. గీ. ఎందుఁబోయిన మనసు నీయంద యుండు
నడవి నుండక పుట్టింటి కరుగు మబల
ఎటకొ నిను వీడి యేను బోయితి నటంచు
విడకు మూపిరి రిత్తగా విద్రుమోష్ఠి.

ఉ. పాపుఁడ నిన్నుఁ గాలగతిఁ బాయుచునుంటిని ప్రేమ లేమిగా
దీపగిదిన్ దనర్చెఁ బరమేశ్వరు నిచ్ఛ యటంచు నమ్మి నీ
వోపికతో వివేకమున నూఱట నెమ్మది నొంది యేగుమీ
యోఁపుకొనుమ్ము ప్రాణ మడియాసఁ సెలంగెడు నంతకాలమున్.

(తెరలో)

చ. తెలతెలవాఱెఁగా మొదటిదిక్కు గనుంగవ కింపుఁ బెంపుచున్
వలిపిరిగాలి వీచెడిని పక్షిగణంబులు గూయు చుండెడిన్.
జలజముమొగ్గ విచ్చెఁగనె చట్టన వెల్వడి గండుతుమ్మెదల్
కలరవమాధురిన్ శ్రుతిసుఖం బొదవించుచు నుండె నెంతయున్.

నాయ:- విని పాటసారుల మాటవలె నున్నది. తెల్లవాఱినది. కాన నిఁక నాలస్యము సేయఁగూడదు.

మ. మనసున్ దీమసమున్ ముదంబునిట నీమత్స్యాక్షితోఁబాయుచున్
దనుమాత్రంబునఁ నేగుచుండితిని గాంతారంబునన్ నిర్జనం
బున వర్తించు బతివ్రతన్ భవుఁడు సంపూర్ణానుకంపాధ్యుఁడై
మనుచుంగావుత తన్వి బంధుజనవేశ్మంబే పడిన్ జేరుతన్.

(అని పోవును)

దమ:- (పొర్లి ప్రబోధము నటించుచుఁ గన్నులు మూసికొనియే దోయిలిఁ బట్టుకొని)

తే. గీ. ఎన్నఁడేని వియోగంబు నెఱుఁగరాక
గుణసమగ్రతయందునఁ గొదవలేక
నిరవధిసుఖంబు నిత్యసంతృప్త మైన
యర్థజానిమహంబు భవ్యదము గాత.

తే. గీ. సకలచిదచిన్మయం బగుశక్తిఁ గూడి
యఖిలశుభగుణమణి నికరాబ్ధియగుచు
సంతతాస్పృష్టదోషసంజాత మైన
శివపరబ్రహ్మ మెప్పుడు శివములిడుత.

తే. గీ. సకలభావంబులను బీజసంచయంబు
నాట దృశ్యాద్యమౌ జగన్నాటకంబు
సంధిసంగతి సాగించి సంహరించు
నాదికవి హరుఁడు మనుచుత మనవరతము.

(ధ్యానము నటించి గద్గదస్వరముతో) హా! భగవానుఁడా!
హైమవతీపతీ! మా కీతీరున దుర్గతినే ఫలింపఁజేయుచుంటివా?

చ. వసుమతిన ట్లనంత మగువై భవ మంతనుఁ బాసి దానిపై
నసువులకన్న ముద్దయినయాత్మజులన్ విడనాడి యొక్కఁడే
వసనఁపుకొంగు లజ్జ కనపాయకరంబుగఁ దాల్చి యాకులన్
మెసవుచు నెండుచున్ గటికినేలలఁ బండుచు నుంటి మీాశ్వరా.

తే. గీ. చిత్తమున కించుశృంగారచేష్ట గలదె
యకట రుచియించు నాహార మైన యున్నె
నిర్విచారంబుగా సుఖనిద్ర యెట్లు?
పయనములఁ గల్గునిడుమల బాపుమీాశ.

ఉ. ఎవ్వనిదర్శనార్థము నిరీక్షణ సల్పుదురో మహీశులిం
కెవ్వతదాకటాక్షము దిగీశులు నాఁచికొనన్ గడంగిరో
యవ్విదితాఖ్యు లిద్దఱు వనాంతరమం దఖిలార్తిపాత్రులై
న వ్వాదవించు చుండిరి వనంబున నుండు కిరాతజాతికిన్.

చం. అవనిపసర్వచక్రమకుటాంచితమాల్యరజః కరంబితం
బవువిభుపాదపంకజ మహర్నిశముం దనిం గ్రత్తిరాళ్ళచే
నవసి యనారతప్రవహ దస్రఝరీ నివహావలక్షమై
శివశివ యెట్టిదుర్దశనుం జెందెనొ చూడు నితాన్తసత్కృపన్.

(చేయి సాచి సందియముతో కన్నులుం దెఱచి తనలో) ఆర్య పుత్రుండును నెటకోవోయెను.

మ. ఎటకేఁ దొర్లుట నిద్రచే నెడముగా నిం దుండెనో యద్దిగా
కిట నే చీఁకట నన్ను జూచుచు నిఁకెందే నిల్చియున్నాఁడొకో
అటుగా కిచ్చట నిద్రలో మృగముచే నాకృష్టుఁడై వోయెనో
స్ఫుటముం జేయుదు ప్రాణనాథ యిపుడెచ్చో నుంటివో పల్కుమా.

(కొంచెము సేపూరకుండి భయశోకములతో దనలో) అయ్యో! ఏమిదిక్కు.

తే. గీ. ఇప్పుడు ప్రియుండునుంగూడ నేగె నెటకొ
వివసనుం డగునతఁ డెట్లు వెడలఁగలఁడు

(చీరజూచి నిశ్చయించుకొని)

కొంపమునిఁ గేఁగదా చీర చింపఁబడియె
నాపయి పిరక్తినే పొంది నడిచె నెటకొ.

కొంచెమునడిచి వెదకుదునుగాక! వెదకిన నేమి ప్రయోజనము?

ఉ. త న్నెన నమ్మి నిద్రఁ గనుతన్విని నద్దమ రేయిఁ గానలోఁ
దిన్నగఁ జీరఁ జించుకొని తెంపునఁ బోయినవాఁడు సిక్కునే

(ఆలోచించి ఔత్సుక్యముతో)

మున్నుగ నట్లు వోయిననుఁ బూనఁడె చింత దృఢానుతప్తుఁడై
తెన్నున నిల్చుఁగాన నిఁకఁ దెప్పున వెల్వడి చూచుటొప్పగున్.

(వంగి చేతులు సాచి చూచుచు)

చ. అడుగులజాడఁ జూతునన నంధతమంబున నేమి గానరా
దుడుగక కేక వైతునన నోపదు నాలుక యాఁటివోఁపుటన్
తడసి ప్రభాత మావెనుక దారినె వోవుదు నన్న దూరమా
వడిఁబడ నేల నెమ్మదిగ వచ్చునటన్న మనంబు గుంజెడిన్.

ఉ. కొమ్మను వీడఁగానె సమకూరిన వే తన కన్ని సౌఖ్యముల్
మమ్ముల హింస వెట్టఁగనె మాలవిధాతకుఁ మేలు గూడెనే
యిమ్ముగ నన్నుఁ గన్న ధరణీశువ కేమి ఫలమ్ము గల్గె నిం
కిమ్మహిఁ గంటి నేను జనియించి విశేషము లేమి భోగముల్.

సీ. మొదట నీ పూరుషముఖ్యు గుణంబుల
విను కలి దశలచే వెతలు గనుట
నామీద నాయన కనురక్తి గలిగింప
నంచతోఁ గబురంపి యార్తివడుట
తరువాత నీయన సురదౌత్యమునకు రాఁ
దలఁపు నెగ్గదటంచుఁ దల్లడిలుట
పిమ్మట దిక్పతుల్ ప్రియరూపయుతులుగా
డెంద మాందోళింప డీలవడుట

తే. గీ. విభవము దొలంగఁ దిరుగుట విపినసీమఁ
జివర కిట భర్తచేతఁ ద్యజింపఁ బడుట
జన్మమొదలుగ సకలకష్టములతోన
దముని చెల్లెలి బ్రదుకిట్లె తగులఁబడియె.

అయ్యో! కర్మపరిపాకము నెవరు దప్పింపఁగలరు.

చ. మునుపటికర్మ దూష్యమగు మూలముగా నది కష్టరాజికిన్
వనజభవుండు దూష్యుఁడగు వంకరగీతలె వ్రాయుచుండుఁగా
మనుజునిజన్మ దూష్యమగు మానిని జన్మ మఱింతదూష్య మా
ననదతనంబుపట్టి దమయంతిభవం బతిదూష్య మందునుర్.

సీ. విబుధులు చెప్పఁడీ విభుఁడెందుఁబోయెనో
దిక్పతులార మీరీవనమెది
సాంబ ననుం గావు శాంభవి కరుణించి
వేగమె పతిభిక్ష వెట్టుమమ్మ
ధాత చెప్పఁగ దయ్య ధవుని నిల్లెడఁబాసి
యొక్కర్తు నెల్లపు డుండవలెనొ
వనదేవతల్ మీరు వారింపుఁడీ నాథుఁ
బోనీకు నాప్రియు భూమిదేవి

(కొంచెముసే పూరకుండి నిట్టూర్పు విడిచి) బదులుమాట లేదు, అదియుక్తమే.

తే. గీ. క్రీడ నిదురేది కనుఁగవ గెంపువారఁ
గోపమో యని చాటువుల్ గుప్పునట్టి
ప్రియుఁడె విడనాడి పోవఁగా దయపరులకుఁ
మొలచు నెట్టులు దౌర్భాగ్యమూర్తి మీఁద.

కానిమ్ము. వెదకుదునుగాక. (మండపమునుండి దిగుటను నటించుచు స్పర్శము నభినయించి సంతసముతో) ఇచ్చట జల్లగా నేదో ప్రాణిశరీరమువోలెఁ దోఁచెడిని. (కుబుసము నలిపి సంబరముతో) ఆర్యపుత్రా! వస్త్రముతోఁగూడనె దొరకితివిగదా! నీవు నన్నేడిపింపనె మండపముదిగి క్రిందనె నిశ్శబ్దముగాఁ బండుకొనియుంటివా (అని చేతులతో స్నేహానురాగములతోఁ గౌఁగిలించుకొనుచునే భయముతో) అయ్యో పాముపాము. ఇది పెద్ద కొండచిలువ. (అజగరము నోరు తెఱచి పాదములను దిగమ్రింగుచున్నది)

అయ్యో! అయ్యో! అమంగళము అగమంగళము. కొండ చిలువ నన్ను మ్రింగుచున్నది. చనిపోవుచున్నదానను. నాకు దిక్కు లేదాయె. ప్రియా! ఆర్యపుత్రా! ఎచ్చటనుంటివి? రక్షింపుము రక్షింపుము (అని యేడ్చుచుండును అజగరము

దమయంతినిలాగికొని కన్నములోనికిఁ దీసికొనిపోవుచుండును.)
దేవతలారా! రండు కొండచిలువ కొండచిలువ. నాకు దిక్కు లేదాయె. అజగరము నన్ను బిలములోనికిఁ దీసికొనిపోవు చున్నది. ఆర్యపుత్రునకు మేలు కలుగుగాత.

"శివాయోం నమః"

ఇది భారద్వాజసగోత్ర శ్రీజ్వాలాంబికా ఘోరనాథా
రాధ్యపుత్ర బుధజనవిధేయ నాగలింగాభిధేయ
కృతి విశేషమగు నలప్రవాసమునందు
విప్రలంభమను తృతీయాంకము.

---

శ్రీ

శివాభ్యాంనమః

# నలప్రవాసము

## చతుర్థాంకము

ఏలాపత్రుఁడు:- (లజ్జ పడుచుఁ బ్రవేశించి తనలో) ఈసంగతి ప్రభువున కేమని విన్నవింతును. ఏమన దమయంతిని శీలమునుండి తొలఁగింపుమని కలి నా కానతిచ్చెను. ఏ నాపనికై రాగా దైవవశమునఁ గిరాతుం డొకఁ డాపనికే తలఁపడియెను. అంత నేను తొలఁగివచ్చితిని. ఇది యంతయు నిట్లె విన్నవింతునుగాక. (కొంచెము నడిచి యెదురఁజూచి సందియముతో)

ఉ. నల్లనిమేని తోడుత ఘనంబగు తేజము వెల్లిగొల్పఁగా
నల్లలనాడు కుండలయుగాంచిత గండతలంబుశోభిలన్
దెల్లనిపంచెఁ దాల్చి యతితీవ్రముగా నిట కేగుదెంచెడిన్
ఫుల్లసరోజలోచనుఁడు పూర్వము జూచినమాడ్కిఁ దోచెడిన్. 1

(ప్రవేశించి సంతసముతో)

కర్కోటకుడు:- (తనలో) నిజముగా నేను ఋణవిముక్తుఁడనైతిని. ఏమన, చేసిన యుపకారమునకు బదులు సేసితిగదా! అది యుక్తమే. ఈమహాభాగుఁడు.

చం. అగణితయజ్ఞకోటి నమరావళిఁ దన్పి నజీర్ణపూర్ణతన్
సుగుణమణిప్రభంగులము శోభిలఁజేసెఁ బదింటి నాల్గిటన్
జగముల నించె నిర్మలయశంబుల నైషధుఁడింక వై
రిగహనవహ్ని పావనచరిత్రుఁడు క్షత్రియగోత్రమాత్రుఁడే. 2

ఏలా:- (చూచి సంతసముతో) ఎట్టెట్లు? మాకుఁ బ్రియమిత్రుఁడైన కర్కోటకుఁడే. కాన వీనిఁ గలిసికొందుంగాక. (అని దగ్గఱకుఁ బోయి) సఖుఁడా! స్వాగతమా.

కర్కో:- (విని ఆలోచించి) వీఁడుఁ గలికి బ్రియమిత్రుఁ డగు నేలాపత్రుఁడే. (ప్రకాశముగా) సఖుఁడా! చాలకాలమునకుఁ గనఁబడితివి. (అని కౌఁగిలించుకొనుచున్నాఁడు)

ఏలా:- (ఔత్సుక్యముతో) సఖుఁడా! ఎటనుండి వచ్చుచున్నావు.

కర్కో:- చెప్పుచున్నాఁడ వినుము. నన్నుఁ గార్చిచ్చు నలువైపులఁ జుట్టుకొని యుండఁగా నాసమయమున భూతదయామయమూర్తియైన నలచక్రవర్తి యటకు వచ్చెను. ఇద్దానినుండి నన్నుఁ గావు మని యేను వేఁడఁగా నమ్మహాత్ముఁడు రక్షించెను. అంత నేను కలియాజ్ఞ మీఱరాని దగుటచే మహాత్మా! నీవు నాకుఁ బ్రాణప్రదాతవుగాన నీపాదములకుఁ బ్రణామంబుఁ గావింతునని చెప్పి యాయన పాదములు పట్టుకొని కఱచితిని. నావిషయోగముచే నా పుణ్యపురుషునకు మాఱురూపు సంభవించెను.

ఏలా:- సఖుఁడా! నీకుఁ బ్రాణదానముగావించిన యాయనకుఁ బ్రత్యుపకారము నీ వేమి చేసితివి.

కర్కో:- పాదప్రణామముకన్న నేమి యున్నది. అదిగాక నా విషము వలన నాయనకుఁ గల్గిన రూపాంతర మజ్ఞాతవాసమునకు సాహాయ్యకారిగానే యున్నదిగదా!

ఏలా:- (స్మృతి నభినయించి) అయ్యో! ఆయన భార్య నిప్పుడే **చూచితిని.**

కర్కో:- (ఔత్సుక్యముతో) ఎట్లు? నీ వెక్కడఁ జూచితివి. ఆమె యెట్లున్నది?

ఏలా:- ఒక కిరాతుఁడు దారి సూపుచుండ నేడ్చుచుఁ బోవుచున్నది. దగ్గఱనే తూర్పుగా నున్నది. మనము త్వరగాఁ బోవు నెడఁ గనఁబడగలదు.

( తెరలో )

ఓ భిల్లమల్లుఁడా వినుము.

తే. గీ. తనువుఁ బ్రోచితి వద్దానఁ దండ్రి వీవు
కూఁతునెడ నీకు మోహంబు కూడదుగద
కష్టమున నున్ననాస్థితిఁ గాంచి యైన
దలఁపు విడనాడితవ యేనిఁ గలుగు మేలు. 3

భిల్లుఁడు:- కాంతా! ఇది పాపకార్య మంటివిగదా వినుము.

ఉ. ధాత వరించెఁ గూఁతతని తాత వరించెను కూఁతుకూఁతు స్వ
ర్నేత యహల్యఁ గూడె రజనీపతియుం గురుపత్నిఁ బొందె నీ
రీతి సనాతనాదృతచరిత్రల సిద్ధముగాన రూఢిగాఁ
బాతక మేమి గా దనుచు భావన సేయుము పద్మలోచనా. 4

తే. గీ. ఫణిముఖమునుండి నిన్నుఁ గాపాడినదియుఁ
దిగ్గనక్ సొమ్మసిలునినుఁ దేర్చినదియుఁ
జెదరి పోనీక సరిదారిఁ జేర్చినదియు
నిన్ను భోగింపనేగాన నెనరు గనుము. 5

కరో:- [విని] పాపుఁడు నిర్బంధించు నట్లగపడుచున్నది. కానఁ దొందరగా నేగి యామెను రక్షింపవలయు. (అని త్వరపడుచుందురు)

(తెరలో)

తే. గీ. మూఢచేతనుఁడా నన్ను ముట్టవలదు
బాధ యెటు గల్గెడిం బతివ్రతకు నాకు
నన్నుఁ బ్రదికించి నాచే వినష్టి గొనకు,
మగ్ని మండించి యెవ్వడే నందుఁబడు నె. 6

తే. గీ. మహి నొకర్తు సతీవ్రత మహిమచేత
నల త్రిమూర్తుల శిశువుల నాచరించె
మృతు సజీవుని గావించె బతినొకతుక
వరవనిత శీల మెన్నడు వదలఁబోదు. 7

భిల్లు:- తే. గీ. మెకముల వధించి జీవించు మృగయునొద్ద
ధర్మపన్నములం బాడఁ దనరునొక్కొ
యడ్డులాడకు బ్రదుకుపై నాస యున్న
నింకఁ గర్తవ్యమును నిశ్చయించికొనుము. 8

కర్కో:- పాపుఁ డేదో వంకరపని సేయఁబోవు నట్లున్నది. కానఁ ద్వరగాఁ బోవలయు.

(తిరిగి తెరలో)

తే. గీ. విశదముగ నెల్లపుడు నన్నిదశలయందు
నలునెగా కన్య నిజముగాఁ దలఁపనేని
మాన్య మగు నీసతీవ్రత మహిమచేత
మూఢచేతన యిప్పుడ బూది వగుము. 9

(ఇద్దఱును సంతసముతో) ఈ చండాలుఁడు శపింపఁదగిన వాఁడే. (ఇద్దఱును నానందముతో నెగురుచు) మంచిపని యాయెను. పాపాత్ముఁడు గాలిపోయెను. ఈ యమకుఁ గల దయాళుత్వ మేమి? అపకారినిఁగూర్చియు విచారపడుచున్నది.

(తిరిగి తెరలో)

విజయము ముగిసినది. కాన నీపెరు త్రోవనే పోవుచుఁ బ్రియుని వెదకుదుగాక!

ఏలా, కర్కో:- ఇపుడు మన మీయమయొద్ద కేగుట యనుచితముగానఁ దొలఁగిపోవుదము. (అని పోవుదురు)

ఇది శుద్ధవిష్కంభము

(అంతట భయము ఆశ్చర్యము తొందరగలిగి దమయంతి ప్రవేశించును.)

దమ:- (బాగుగాఁజూచి) ఏమి? యిచ్చట నంతయుఁ గనఁబడుచునే యదృశ్యమగుచున్నది.

చం. కనఁబడియెం దపోవనము గానఁగ నయ్యెను పర్ణశాలలున్
వినఁబడియెన్ దపోధనులు వేడుకతో వచియించు వాక్యముల్
గనుఁగవ కింతయు న్నిలిచి కట్టెదురన్ గలలో నదృశ్యమై
చనుపుటభేదనంబు సదృశంబుగ నున్నది యిప్పుడేలొకో. 10

అదియుండుఁగాక! వారు ప్రసాదించిన వచన మీ విధముగా నున్నది.

చం. శుభవతి నమ్ము మాపలుకు శోకము నొందకు నీవు గ్రమ్మఱన్
విభు నలుఁ గూడియే యనుభవింతువు నిక్కము శేషభోగముల్
విభవము గల్గు చంద్రకళ వృద్ధివహింపదె తిష్యరాట్ప్రరా
భిభవము గల్గునంతకును వేచుము గాలముఁ గొంత నూఱటన్. 11

(ఆలోచించి) ఇది యంతయు దండాపూపిక న్యాయమున నసత్య మనియే తోఁచెడిని. గోడ యుండినఁగదా చిత్తరువు. అదిగాక నాకుఁ గల యెట్లువచ్చును?

తే. గీ. నిదురనశియించె నెప్పుడో మదికలంత
జాగ్రతయ యిపుడు మాఱెనో స్వప్నముగను
జాలికం డెట్లు వచ్చును చానకడకు
విధివిలాస మ దెన్నియో విధములుగద. 12

తే. గీ. క్షణము సుఖ ముండు దుఃఖ మా క్షణములోన
నపుడె రెం డుండు రెండుం డవంతలోన
విధివిలాసంబు జాలిక విధమెయగుచు
సారిఁది నే మేమి దశలనుఁ జూపకుండు. 13

అది యుండుఁగాక! ఈదారి నేపోపుచు వెదకుదునుగాక! (అని కొంచెము నడచి వృక్షముల నవలోకించి ఆదరముతో దోయిలివట్టికొని)

చం. నతితతి మీకొనర్చితి వనస్పతులార యనుగ్రహింపుఁడీ
పతి యెటఁ బోయెనో చెప్పుఁడు పట్టుఁడు దూరము వోవకుండ నే
కతమునఁ బాసి పోయెనొకొ కాంతను పీడుట ధర్మ మానొ యీ
వితమునుఁ బూర్తిఁగా నడిగి వేగమె తెల్పుఁడు నాకు మీరిటన్.

తే. గీ. తిలక తిలకుఁడెటకుఁబోయెఁ దెలుపఁగదవె
ఓరసాల రసాలయుం డుండె నెందు
సరళ సరళుం డెందు దొరకునమ్మ
చెప్పఁగదరమ్మ జోహారు చేయుచుంటి. 15

కఠినాత్మకులై నమిమ్ము వేడిన నేమిప్రయోజనము?

సీ. హా తల్లిరో యిట్టు లత్యంతదుఃఖ నౌ
కన్నియ నీవేల గంటివమ్మ
హా తండ్రి నీకేకపుత్రినై యిప్పుడీ
యడవిలోఁ బ్రియునిచే విడువఁబడితి
హా యన్న దుర్భగ నౌ చెల్లియం గూర్చి
పలుమఱు శోకించి బాధవడకు
ప్రజలార ననుఁబోలు బాలిక బుట్టఁగా
వలెనని కలనైనఁ దలఁపవలదు

తే. గీ. బంధుతతులార పరిచితప్రాయులార
ననుఁ దలంచి విచారమ్ము గనకుఁడయ్య
పూర్వసంచిత దుష్కృత భోగసమితి
నవశముగనొంది యీగతి ననుభవింతు. 16

హా నాథా! కరుణానిధీ! భగవతీ భవితవ్యతా! హా భగవానుఁడా! భవానీపతీ! ఇఁక గతి యేమి? దీనాలాపములు సేయునాకు దిక్కెవ్వరు? ఎందుఁబోవుదు?

తే. గీ. అహహా ప్రియతమ హా నాథ గృహిణినన్ను
బూర్వవిశ్వాసమున నిద్రవోవుదాని
వదలిపోవఁగ నీ కెట్లు వాంఛ గలిగె
మనుజులకు దుర్ద న్మది మాఱునే మొ. 17

నాయం దేదేని దోసము గలదా? అట్లయినను,

చం. మలిన మటంచు నద్దమును మానక బ్రద్దలు సేయవచ్చునే
నలఁగెనటంచును న్మాలక నాళముతోఁ బెకలింపవచ్చునే
కలఁగెఁగదా యటంచు దనకన్ను వడిం బెఱికింపవచ్చునే
కలిఁగెను దోస మంచు నిజకాంతను వీడుట యట్టిదానుగా. 18

తే. గీ. దుష్టదైవంబు సిరి నేలఁ దొలఁగఁజేసె
ఘోరవిపినంబు మన మేల చేరవలసె
నెన్న డెఱుఁగని నిద్ర నేఁడేలవచ్చె
నిన్నియును గూడె నాదైన యెగ్గుకొఱకె. 19

ప్రాణనాథుఁడవగు నీవే వదలిపెట్టి పోవఁగ నన్ను గరుణించువా రెవ్వరు?

తే. గీ. ప్రియుఁడు విడనాడ నందఱు విడుతు రెపుడు
మానవతి యెందు సిగ్గేది మనుటకంటె
ప్రాణములఁ బాయుటే యశఃప్రదము నిజము
తిత్తిలో నూఁగులాడెడి తెమ్మరవలె. 20

తే. గీ. ప్రాణవాయులక్షణికత ప్రకటముగద
ప్రాణములు వీడఁగా నుపాయంబెఱుంగ
పామునోరను వ్యాధునిఁ పాలఁబడితి
నెట్టులును వీడిపోవాయె నేమివెరవు. 21

తే. గీ. తల్లిమొదలుగ బంధు లెందఱు గలిఁగినఁ
బతియ దిక్కని యడవికి వచ్చియుంటి

నట్టడవి వీడి యెటో పోయినాఁడవుగద
యింతకఠినత జనులలో నెందుగలదు.

ఔరా! మగవారిని నెప్పుడు నమ్మఁగూడదు. 22

తే. గీ. ఎదుటఁ బ్రేమంబు జూపింత్రు హెచ్చుదనర
జాటున విరోధిభావమే సాటుచుంద్రు
పొలఁతుకలలోన వెదకినఁ బురుషు నతిగ
నావలెనె నమ్మి చెడినట్టి నాఁతిలేదు. 23

ఉ. నెమ్మది యెల్లవేళలను నీపయినే తిర ముండుఁగాదె యో
కొమ్మరో నీమదిం గలుగు కోర్కెల వేగమె తెల్పుమంచు బల్
నమ్మకముం ఘటించి విజనం బగుచో నిదురించుచుండ వే
గమ్మున వీడిపోయితివిగా నిను నేమననేర్తు నక్కటా 24

ప్రేమలేనివాని నుద్దేశించి యేమనినను ప్రయోజనములేదు.

తే. గీ. బహుళకష్టంబులను జెందవలసినట్లు
ఫాలమున గీర నా కున్నలీలఁ దోఁచె
నాకతంబుననే చింపికోకఁదాల్చి
వసుమతీచక్రవర్తిత వదలెఁ బ్రభువు. 25

ఇఁక సుఖము లనుభవింతుననుట కల్ల. కాన నిప్పుడు ప్రాణము వదలుటే మేలు. ఈ చెట్టుకొమ్మకే యురి వైచికొందునుగాక. (అచట నొక తీవం గాంచి దోయిలి వట్టికొని)

తే. గీ. అంతరమున నీవు నెంతయు నార్ద్రమగుదు
గాన కఠినతరాత్మవు గావు నీవు
సాధ్వివలె నున్నదానవో సరసురాల
యడుఁగుదును చెప్పు నీవు నాయధిపుఁ డెచట. 26

నీవును మాటాడవా? అటులేని నీవు నామెడకు నురిత్రాటి వగుము. అహహా! నీవును గఠినాత్మవే. మౌనమవలంబించుట

యంగీకరించినట్లే కదా. దీనింబట్టి నీకును నే నూపిరి విడుచుట యిష్టమనియే విశదమయ్యెడిని. (ఆ తీవ ద్రుంచి యూపులు దూసి తిరస్కారభావముతో)

తే. గీ. ముందు నోతీవ మృదువుగా నుందు వీవు
ప్రాఁకుఁ జుట్టియునుం గట్టి వడుదువుగద
ప్రక్కచెట్టుఁ గళంకింతు ప్రాఁకి నీవు
చెలఁగి లాగుదు వద్దాని జీవకళను. 27

కాన నాయురి ద్రాటికిఁ దగిన దాన వే (అని తీవను చెట్టుకొమ్మకుఁ గట్టి మెడకుఁ దగిలించికొని తూర్పుముఖముగాఁ దిరిగి దోయిలి వట్టికొని కన్నీరు గార్చుచు నాకాశమునఁ జూపునిలిపి)

చం. కనుఁడు సుపర్వులార నృపకన్యక బ్రాణము రిందృజించెదన్
ననుఁ బతి వాసిపోయె శరణమ్మ నెఱుంగమి నుద్యమించితిన్
వెనుక నె గల్గు జన్మమున విశ్రుతశీలుఁడు నైషధుండె నా
కనుఁగువరుండుగాఁ బడయునట్టుల నన్ను ననుగ్రహింపుఁడీ. 28

(చెప్పినట్లు చేయుచుండును)

(తెరలో)

ఉ. హా హరిణాక్షి యొక్కత గళావృత మాలతఁ జెట్టుకొమ్మ స
న్నాహమునన్ బిగించి కరుణంబుగ నేమొకో యుచ్చరించుచున్
సాహస మాచరించి యిటుఁ జచ్చెను చచ్చెను వచ్చి చూడుఁడీ
యోహరిమధ్య యాత్మహతి యొప్పదుగావున మాను మానినీ.

(తొందరఁగా వచ్చి తీవ పట్టుకొందురు)

దమ:- (కన్నీరు గార్చుచు గద్గదస్వరముతోఁ) అయ్యో! ఇదియేమి?

తే. గీ. ప్రియుఁడు విడనాడ నుసురులు విడుచునన్ను
నడ్డగించెద రిదియేమి యార్యులార

ఆర్ద్రహృదయుల రైన మీయడుగులందుఁ
బడుదుఁ బాపాత్మురాల నన్ విడువుఁడయ్య. 30

పుణ్యపురుషులారా! మీ రీపాపురాలినిఁ బ్రదికింప యత్నింప కుఁడు. నన్నుఁ జూచినను మీకు బాపము వచ్చును.

వర్తకులు:— ఈమె పాతివ్రత్య మేమి? వినయ మేమి? రూప మేమి? వాఙ్మాధుర్య మేమి? ఇఁక నీయమ భీమమహారాజు పుత్రి, నైషధుని పత్ని యగు దమయంతియే కావలయు. కాఁబట్టి యీమెను వెంబడిఁ దీసికొనిపోవలయు.

ఉ. ఓయమ శోకమొందకు ప్రియుండు నలుండెటో యిప్పుడేలొకో
వోయిన రాకయుండడు ప్రబోధమునన్ మది నూఱడిల్లుమీ
ఛాయనువీడి భాస్కరుఁడు చంద్రికఁ గూడక చంద్రుఁ డుండునే
కాయము గాచికొ మ్మిపుడు క్రమ్మఱఁగందు వశేషభోగముల్.

మేము మీకుండినపురమునకే పోవుచుంటిమి కాన మాతో నరుదెమ్ము.

దమ:— ఏమి? యిట్లు నాకుఁ బ్రాణత్యాగమునకు నాటంకములే సంభవించుచున్నవి. (ఆలోచించి)

తే. గీ. నాకు ననుభవశేష మున్నదియొ యెఱుఁగ
జనులలో లాఘవము గాంచి చావవలెనొ
ప్రియునితో యోగమిఁక సంభవించు టేడ
దైవసంకల్ప మెట్టిదో తలఁపరాదు. 32

పుణ్యపురుషులారా! మీరు నన్ను గనికరించుచున్నా రది యేల?

తే. గీ. సిరులచే మొట్టమొదటఁ ద్యజింపఁబడితిఁ
బ్రియునిచేఁగూడ నడవిలో విడువఁబడితి
నిట్టి దౌర్భాగ్యవతి నన్ను నిపుడు మీరు
పాపురాలినిఁ బ్రోవ సత్ఫలము గలదె. 33

నన్ను వదలిపెట్టి దూరముగాఁ బోవుఁడు. (అని నమస్క-
రించును.)

వర్త:- మిత్రులారా! మన మీమెను వదలిపెట్టి పోయితిమేని మనకు సేమములేదు. కాఁబట్టి యీమెను మన యాఁడువారిలోఁ గలుపుదము.

(ఇరుమువ్వురు అటులేయని పోవుదురు)

దమ:- సత్పురుషులారా!

తే. గీ. ఆలకింపుఁడు నామాట యాదరమున
దైవహతనన్నుఁ బ్రోవుట దగదుమీకుఁ
జేతులారఁగ జోహారు సేయుదాన
తేరకెందేని నాస్థితి దెలుపవలదు.

వర్త:- (దుఃఖముతో స్నేహముతో) అమ్మా! అట్లుగాదు.

తే. గీ. తన్వి మమ్ములఁ బరులగాఁ దలపవలదు
పోలఁతి మాకిఁక నీదైన ప్రోపుకంటె
నింకొకటి పుణ్యకీర్తిదంబేమిలేదు
తండ్రియొద్దకుఁ జేర్తుము తరలిరమ్మ.

దమ:- (తనలో) వీరలు నమ్మఁదగిన వారివలెనే గనఁబడుచున్నారు. (ఆలోచించి) తండ్రియింటికిఁ బోయినను నీ యభాగ్యురాలి కేమి ప్రయోజనము? (ప్రకాశముగా) మీరు నన్ను నిజముగాఁ బుట్టింటికే చేర్తురు. ఐనను బుట్టింటనుండుట దురదృష్టురాలికి నవమానకరమేగదా!

వర్త:- అమ్మా! ఒకసారి యట నవమానంబును గలుగవచ్చును. అట్లైనను నీవు దండ్రిగృహంబున నుందువేని వారు నీప్రియుని వెదకి రప్పింప ననువుగా నుండును.

దమ:- (తనలో) ఇప్పని హితముగానే తోఁచెడిని. అట్లుగాక యిప్పుడే మరణింప నేమిలాభము? ఇఁక వెదకినను ప్రియుఁడు దొరకని పక్షమున నది యెట్లును నున్నదే. (ప్రకాశముగా) కానిండు. మీరే నాకు దిక్కు. (ఉరిపెట్టుకొనిన తీవ వదలిపెట్టి వర్తకులను సమీపించును)

వర్త:- అమ్మా భయపడకుము. మా యాఁడువారితోఁ గలియుము.

(తెరలో పెద్ద కలకలము)

అయ్యో! అయ్యో!

చ. పదములచేతఁ ద్రొక్కుచును బల్విరఁ దుండముచేతఁ బెక్కులన్
జిదుపుచు దంతకుంతములఁ జీల్చుచుఁ గొందఱ ద్రుంచఁజేయుచున్
భిదురరవమ్ము మించు శ్రుతిభేదక ఘీంకృతు లాచరించుచున్
మదకరి వచ్చుచున్నది సమాప్తయుగభ్రమ దభ్రమోయనన్.

వర్త:- (విని వేగముతో) అమ్మా! నీ విచ్చటనే యుండుము. మా కటకమునకే యేనుఁగువల్ల పెద్ద యుపద్రవము తటస్థించినది. (అనుచుఁ బోవుదురు)

దమ:- (దుఃఖముతో) ఇదియేమి? ఉపకారులకే యెగ్గు సంప్రాప్తమైనది. ఇది పాపురాలికి మేలుసేయఁగడఁగిన దానికి ఫలము కావలయు. (భయముతో వేగముతోను) అయ్యో! ఏనుఁగిటే వచ్చుచున్నది. కావున నెట్లో యుఱికెదను. (ఉఱుకుచునే గన్నీరుగార్చుచు)

తే. గీ. వనమతేభంబుచే పీడఁబడుదు నేని
కాంతు వెదకుటకై యంతఁ గడంగుదాన

నేమి గానున్నదో యీశుఁడే యెఱుంగు
జనుల జీవన మంతయు క్షణికముగద.

(అని యేడ్చుచు నిట్టూర్పు విడుచుచుఁ నులుకుచుఁ బడుచు లేచుచుఁ బోవును.)

ఇది భారద్వాజసగోత్ర శ్రీజ్వాలాంబికా ఘోరనాథా
రాధ్యపుత్ర బుధజనవిధేయ నాగలింగాభిధేయ
కృతి విశేషమగు నలప్రవాసమునందు
కరుణధారయను చతుర్థాంకము.

---

శ్రీ

శివాభ్యాంనమః

# నలప్రవాసము

## పంచమాంకము

(జీవలవార్ష్ణేయులతోఁగూడ నిద్రలోఁ గలవరించుచున్న బాహుకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

బాహు:- హా ప్రియా! హా పత్యభిప్రాయానువర్తినీ! హా సతత ప్రసన్నముఖీ! హా చారుహాసినీ! హా సర్వాంగసుందరీ! ఎందుంటివి? ఏమిసేయుచుంటివి? ఎటఁ దిరుగుచుంటివి? ఎట్టి యవస్థలోనుంటివి? తిరుగుచుంటివా? ఒకచోఁబడి యేడ్చుచుంటివా? లేక సొమ్మసిల్లితివా? ఇఁక నటనే నా రాక నెదురుచూచుచు నూరకుంటివా? విలపించుచుంటివా? అవసానమునకు నుద్యమించుచుంటివా? హా! నేహతుఁడనైతి. అనాధుఁడనైతి. జీవన్మృతుఁడనైతి. ప్రియా! తపము సేయుచుంటివో! అడవిలో మృగములచే బాధింపబడుచుంటివో. నన్ను శపించుచుంటివో నేను నిందార్హుడనే యగుదు. దిక్కులేనిభార్యను విడిచిపెట్టిననాయంతనింద్యుఁ డుండునె? మన యిద్దఱవిధి యిట్లున్నది. అధికముగా విచారింప నేమిప్రయోజనము? (ఫూత్కారముతో నిట్టూర్పు విడుచుచున్నాఁడు)
జీవలుఁడు (జనాంతికముగా ఆశ్చర్యముతో) సఖుఁడా! వార్ష్ణేయా! నీవు బాహుకుని విలాపము వింటివా?

వార్ష్ణే:- నాకును వినఁబడుచునే యున్నది. ఎవ్వరినోగూర్చి యితఁడు



విలపించుచున్నాఁడు. కాని వీనికిఁగూడ ప్రేమించిన కాంత యుండునా?

జీవ:- అటులేల. వానివానికిఁ దగునట్టు లెల్లవారికిని భార్యయుండును.

వార్ష్ణే:- (నవ్వుచు) ఏమో కామినికి వీనియం దెట్టు లనురాగ ముండునో నాకుఁ దోఁపదు. ఏమన వీనికి

ఉ. గట్టిగఁ దుమ్మమొద్దువలె గన్పడుచున్నది కాయ మెంతయున్
బొట్టివి యంగముల్ వెఱపుఁబుచ్చెడు చూపును రేగి యంగరాల్
సుట్టిన చిట్టవెండ్రుకలు లొట్టపిట్టం దలపించు నోష్ఠమున్
బుట్టినదాదిగా నదుకుపోడిమిగానని కట్టుపుట్టమున్. 1

బాహు:- (కన్నీరుగార్చుచు) హా ప్రియా! దమయంతీ!

శా. హా నాథా యని యేడ్చి దుఃఖవశతం బ్రాణంబులం బాసితో
గానన్ క్షుద్రజనంబు పాలబడితో గా కందు మూర్ఛిల్లితో
నానా జీవులచేతఁ జీల్పఁబడితో నవ్యాఘ్రసపానాశచే
గ్లానిన్ సైపక దావపావకమునన్ గాయంబు నర్పించితో. 2

హా! హతుఁడ నైతి హా! నిష్ఫలజీవితుఁడ నైతి. (అని విలపించుచుఁ బ్రక్కమీఁదనుండి క్రిందఁ బడును.)

జీవ:- సఖుఁడా! తెలివి దప్పి క్రిందఁబడుటఁ జూచితివా.

వార్ష్ణే:- (శంకతో) ఇతఁడు విలపించు నప్పుడు దమయంతి యనుచున్నాఁడు. ఇతఁడే మా ప్రభువై యుండునా! బాగుగాఁ జూచి వీని రూపముఁ జూడఁగా మా ప్రభువు గాఁడని స్పష్టమగుచునే యున్నది.

ఉ. వీనులనాను కన్నుఁగవ పెందలుపున్ దలపించు నక్కునన్
జానులఁ దాఁకుచేతులు విశాలలలాటము నెత్తునాసయున్

యానము ద్వీపిసింహామదహస్తి మహోక్షగతిఁ హాసించెడిఁ
మానిత సర్వలక్షణుఁడు మా ప్రభు వీతఁడుగాఁడు చూడఁగ. 3

చ. పొడవుగనుండు కన్బొమలు పొట్టినఖంబులు సన్నలోమముల్
తొడలును పిక్కలుఁ మఱియు స్థూలములుఁ సమమైన జానుల్
వడువున నెల్ల నౌపెదవి పాలవలెఁ దెలుపైన దంతముల్
పుడమికి నెల్ల జీవమణిభూషణభూతుఁడు నైషధుండగుఁ. 4

ఉ. చేతులయందు శంఖసరసీరుహ చక్రయవాది రేఖలుఁ
బ్రాతిఁ బదాంబుజద్వయిని వజ్రధనుర్హల మత్స్య రేఖలూ
న్నాతను రేఖ ఫాలమున రాజిల సర్వ మహీశలక్ష్మ నీ
రీతి ధరాతలంబున ధరించినవాఁ డతఁ డొక్కరుండెకా. 5

కావున నితఁడెంతమాత్రము మా ప్రభువు గానేఱఁడు. ఇఁక వీఁడెవఁడో పొట్టఁబోసికొన వచ్చినవాఁడు.

జీవ:- ఔనవును. దమయంతి యను పే రింకొకరికుండఁ గూడదా. అంతయు వీనినడిగి తెలిసికొందము.

బాహు:- (చేతులుచఱచి త్వరఁగాలేచి తనలో) ఏమి యిట్లు తెలివి దప్పి ప్రేలితిని. ప్రక్కమీదినుండియుఁ గ్రిందికిఁ బడితిని. నా మాటలు వినుటవలన వీరికి నాయందు సందియము గల్గ నేమో! అది యెట్లు తప్పుకొందును? (ఆలోచించి) ధైర్యముతో వీరిని వంచించుట యెంతపని. వీరున్న డుగనిమ్ము. (పూర్వమువోలెఁ బ్రక్కమీఁదఁ బండుకొనును)

జీవల వార్ష్ణేయులు:- (నవ్వుచు) సఖుఁడా! నీ వెవ్వరినో తలంచుకొని విలపించుటగాక ప్రక్కమీదినుండి క్రిందికినిఁ బడితివి. నీకు భార్య యున్నదా? ఆమె పేరు దమయంతియనియా? మాకు నిజము చెప్పుము.

బాహు:- (తనలో) నేను నిద్రలోఁ బేరుగూడ స్పష్టముగాఁ జెప్పితినా? అయిన నేమి? కానిమ్ము. (ప్రకాశముగా) మిత్రులారా! నేను

కేవలము బ్రహ్మచర్యముననే యున్నవాఁడను. ఇట్టి యాకారముతో నున్న నన్నుఁ గామిని యెట్లు మోహించును? తెలిసియు నీవు భార్య కలదా యని మీ రెట్లడిగితిరో! అయిన నీనడుమ దారిలో నెవరో విలపించుచుండఁగాఁ గొన్నిమాటలు వినియుంటిని. అవి రాత్రి పండుకొనియున్నప్పుడు తలంపునకు వచ్చెను. వానిని నిద్రలోఁ గలవరించితి నేమో.

జీవ:- సఖుఁడా! ఇంతియే యుండవలయు.

వార్ష్ణే:- ఇందు సందియ మేమి. నలమహారాజురూప మెక్కడ, వీని రూప మెక్కడ? మెలకువలో వినినమాటలు కలవరించుటయు లేనిది గాదు. సఖుఁడా! బాహుకా! ఈ మాటలు నీ వెక్కడ వింటివి.

బాహు:- మిత్రుఁడా! నే నెక్కడ విన్నదియు స్పష్టముగాఁ జెప్పఁజాలను గాని యుత్తరారణ్యముననే యెటనో వింటిని.

వార్ష్ణే:- [తనలో] నిజముగా నిది యంతయు మా ప్రభుప్రలాపమే కావలయు, ఏలన, ప్రభు వుత్తరారణ్యమునకే వెడలిపోయె నని వినియుంటిని.

జీవ:- సఖుఁడా! ఈ విలాప మంతయు భార్య దగ్గఱ లేనివానిదిగా నున్నది. ఆయన భార్యతోఁ గూడనె పోయియుండెఁ గదా!

వార్ష్ణే:- అట్లే పోయియుండెను గాని పిమ్మట భార్యను వదలిపెట్టె నేమో యని తోఁచెడిని, మొదట రాజ్యలక్ష్మిని వదలిపెట్టి నట్లే అనంతరము భార్యనుగూడ విడిచిపెట్టె నని తలంచుచున్నాను, [అని నిట్టూర్పు విడుచుచు నాకాశమునఁ జేయి చాఁచి గద్గదస్వరముతో] మహాప్రభూ!

తే. గీ. అరదము చలింప మెలమెల్ల నని వచించు
వాఁడ వీఁకముందుగద యిప్డు వట్టికాళ్ల

మిట్టపల్లములుగ నుండు గట్టినేలఁ
దిరుగుచున్నాఁడ వెట్టులో ధరణినాథ. 6

తే. గీ. ఛత్రమును బట్టు దాసిదాచాపలమున
నెండసోఁకుట సతిచెక్కు లెఱ్ఱవార
నపుడ కను లెఱ్ఱఁజేసెద వట్టిసీవ
యడవి నిర్దయ భైమిని విడిచి తెట్లు. 7

(అని మూర్ఛపోవును)

బాహు:- (తనలో) అబ్బా! ఏమి నాదుర్దశ!

తే. గీ. ఒక్కచో నేను ప్రియురాలిఁ కొక్కచోట
పిల్ల లొకచోట భటు లిట్లు వేఱుచోట
నేమియుఁ బరస్పరస్థితి యెఱుఁగరాక
యెల్లరము శోకసాగర మీఁదవలసె. 8

ఆహా! నేను నాకేగాక మదీయులకును గష్టము గలిగింపనే పుట్టితిని. నాదుస్థితిఁ దలంచి మదీయు లందఱు నిట్లే శోకించుచుందురుగదా! (స్మృతినభినయించి) హా! ప్రియా వైదర్భీ!

ఉ. చాన విలాపభంగి కవసానముగానమి గొంతు బ్రద్దలై
సోనగ నీరుగారి జలశూన్యతచేఁ గనుగ్రుడ్లు లొత్తలై
యానన మెత్తి యింక నెట నంబరకంపిత పాణియుగ్మవై
యే నిటుసేసినాఁడనని యీశునితో మొఱపెట్టుచుంటివో. 9

అట్లుగాక

తే. గీ. పురహరుని కృపనె కుండినపురముసేరి
బాలురనుజూచి వారలఁ బ్రక్కనునిచి
క్రిందఁబడి యేడ్చుచుంటివో కీరవాణి
యెట్టిదుస్థితినుంటివో యెఱుఁగనైతి 10

తే. గీ. దిక్పతులు వచ్చి నీకృపాదృష్టిఁగోరి
పలువిధంబులఁ బ్రార్థించి భంగపడిన
నీయకించనునే వరియించినట్టి
నీదొసఁగుఫలమె యిదియని నేఁదలంతు. 11

(కన్నీరు గార్చుట నభినయించి భయముతో) జీవల వార్ష్ణేయులు మెలఁకువతోన యున్నారు. ఏ నిట్లు లేడువ నగునె? దీనింబట్టి సందేహము తొలఁగియున్న వారికిఁ దిరిగి సందేహము గలుఁగవచ్చుఁగదా! అయిన నేమి? ఇదియుఁ దప్పుకొన నగు. వార్ష్ణేయుఁడు శోకించుచున్నాఁడు గాన వాని కిది యనుశోచన మని నమ్మకము గల్గింపవచ్చుఁ గదా! (ప్రకాశముగా) సఖుఁడా జీవలా! వార్ష్ణేయుఁడు ప్రభువునుగూర్చి శోకించుచున్నాఁడు గాన మన మితని నోదార్పవలయు.

జీవ:— నిజమే. వార్ష్ణేయుఁడు ప్రభువును గూర్చి విచారపడుచునే యున్నాఁడు. ఆయన సార్వభౌముఁడు. ఇప్పు డాపదవినుండి తొలఁగి యెటనో డాఁగి దుర్దశ ననుభవించుచున్నాఁడు. గాన నీతఁ డాయనయందుఁ దనకుఁగల కృతజ్ఞత నిట్లు చూపుచున్నాఁడు.

బాహు:— నిజమే. ఆయన యిప్పు డేస్థితిలోనున్నది తెలియదు. ఆయనకు సార్వభౌమతగూడ నుండెనా? ఏమున్న నేమి? ఇప్పు డది స్వప్నసామ్రాజ్యముం బోలినదిగదా! లలాటమున నున్న లేఖ యెంతవానికినిఁ దప్పుకొన శక్యము గాదు.

బాహుక జీవలులు:— సఖుఁడా! వార్ష్ణేయా! ఊఱడిల్లుము. శోకించిన నేమిప్రయోజనము? (అని పంచెతో విసరుచుందురు.)

వార్ష్ణే:- (తెలివి నొంది) సఖులారా! రాజులకు నోర్పు సహజము గాన మాప్రభువు కష్టము లోర్వఁగలఁడు. కాని యత్యంత సుకుమార యగు మహారాణి యెట్టు లీకష్టము లోర్వఁగలదు?

చం. వరసుత పార్థివేంద్రునకుఁ బత్ని సమస్తధరాధినేత కీ
తరుణి సువర్ణకీర్ణమణిధామములందు వసింప నర్హ దు
 శ్చరకుధరాటవీ కుపథ సంచరణంబు సహించు నెట్లు దు
ష్కరవనవాస మిద్ది జనసంతతిముంపదె శోకవార్నిధిన్ 12

చం. తలిరులు గాలిసేతు లిఁకఁ దక్కినమే నగుఁదీవ యట్టులే
యలరులు మోముగన్ను దమయంతి కగున్ సుకుమారమూర్తియీ
లలన యొకప్పుడేని సవిలాసముగా నెలదోఁట నుండఁగా
గలుఁగునుగాన్ని ఘోర మగుకాఱడివిం జరియింప నేర్చునే. 13

బాహు:- (కన్నీరు గార్చుచు తనలో) భైమిదగు సౌకుమార్య మింతియే యగునా!

క. కనులే కర్ణోత్పలములు
వనిత కగుం బూవుదండ బాహాలతయే
తనుకాంతియె వసనం బగు
ననువగు మందస్మితంబె హారాళి యగున్. 14

తే. గీ. మగువ యుపమానముల కుపమాన మగును
భూషణంబుల కౌను విభూషణంబు
మంగళంబుల కెల్లను మంగళ మగు
సిరుల కెల్లను ముఖ్య మాసిరియె యగును. 15

తే. గీ. ప్రాణమునకన్న ముఖ్యమాప్రాణ మగును
హృదయమునకన్న నెక్కుడౌ హృదయమ యగు
నీ దరిద్రుని వధువుదా హెచ్చుఁదనము
చెప్పగాఁ దరమే యాదిశేషునకును. 16

ఇట్టి కాంతను వనమునందు వదలిపెట్టి యింకనుఁ బ్రదికి యున్నాఁడ.

(తెరలో)

భద్రా! అడవినుండి మరలివచ్చి భద్రబాహునిశాలలో నున్నది.

బాహు:- (విని తనలో) భైమి యొకచో సుఖముగా నున్నదనియుఁ మాకు మేలు గలుఁగు ననియు నుపశ్రుతి సూచించు చున్నది, గాన నింకను ననుభవింపఁదగిన కర్మశేష మున్నది గావలయు, కలలోనైన భైమి సమాగమము గల్గునని నాకుఁ దోపదు. (ప్రకాశముగా) వార్ష్ణేయుఁడా! ఊఁఅడిల్లుము.

వార్ష్ణే:- తెలివినొంది ఉపశ్రుతి వీరికిఁ దిరిగి యోగము గల్గునని సూచించు చున్నది.

జీవ:- అది యుండనీ బాగుగాఁ దెల్లవారినది. ఆవలమాట యెవ్వానిది.

వార్ష్ణే:- విమర్శించి నిన్న నొక యాడగుఱ్ఱ మడవికిఁ బాఱిపోయి యుండెను. దానిసంగతి తెలిసికొని యొకఁడు వేఱొకనికిఁ దెల్పుచున్నాఁడు. కాన నది వేఱువృత్తాంతము.

(తెరలో)

ఆశ్వికులారా! క్రొత్తసారథితోఁగూడ బాహుకునిఁ బిలిచి కొని రండు. రాజుగారు వేటకుఁ బోవుదురు.

జీవ:- సఖులారా! మంత్రి సుబుద్ధిసందేశము వింటిరిగదా!

వార్ష్ణే:- వింటిని. పోవుదము. (అని పోవును.)

బాహు:- (తనలో) గతియేమి? ఏనునుఁ బోవలసినదే.

తే. గీ. అశ్వముల శిక్షసేయుకృత్యంబువలన
సతినిఁదలపోయ క్షణమైనసందు దొరక
దాకతంబున నేమొ దాస్యంబనంగ
నఖిలసుఖయోగసన్న్యాస మనిరి బుధులు. 17

సీ. ఊపిరితోఁ గూడియుండిన మరణంబు
గాలినెచ్చెలి లేనికాలు పగుసు
పాశంబు లేని దౌబంధనం బగుచుండు
నట్లు నరకరహిత యాతన యగు
మఱియు నడుసులేనిమాలిన్య మైయుండు
వ్యాధి లేనియట్టిబాధ యగును
ఐదిటి కెక్కుడై యాఱవ దిద్దిగాఁ
బర నీయ మగుమహాపాతకంబు

ఆ. వె. దాస్య మనఁగఁ బుడమి దానికి నీడైన
నీచపద మికొండు నింకుసున్న
యిద్ది యనుభవింప నెవ్వనితర మగు
పర్వతేన్ద్రి శయన ఫాలనయన. 18

(ప్రకాశముగా) వార్ష్ణేయుఁడా పోవుదము రమ్మి.

( అందఱుఁ బోవుదురు. )

ఇది భారద్వాజసగోత్ర శ్రీజ్వాలాంబికా ఘోరనాథా
రాధ్యపుత్ర బుధజనవిధేయ నాగలింగాభిధేయ
కృతి విశేషమగు నలప్రవాసమునందు
నాయకాజ్ఞాతవాస మను
పంచమాంకము.

శ్రీ

శివాభ్యాంనమః

# నలప్రవాసము

## షష్ఠాంకము

( సైరంధ్రితో సునంద ప్రవేశించును )

సునంద:- దండలు తెచ్చితివా. అవి యేయేపూవులతో నల్లఁబడినవి. ఎంత యెంత పొడవుగలవి. ఏయేవిధముగా నున్నవి.

సైరంధ్రి:- భర్తృదారికా! నూఱుదండ లున్నవి. అవి మల్లె, జాజి మొన్నగుపూలతో నల్లఁబడినవి. ఒక్కబార మొదలుకొని నాలుగుబారలవఱకుఁ పొడవుగలవియు కవచము కిరీటము కడియము, చొక్కాయి మొదలగు రూపములు గలవియును.

సునంద:- వానిని మాయమ్మగారి కిచ్చితివా?

సైరంధ్రి:- ఇచ్చితిని.

సునంద:- మాయమ్మ నిన్ను మాయంతిపురమున వసింపఁ గోరుచున్నది.

సైరంధ్రి:- నావ్రతములకు భంగము గలుగనీయక కాపాడునెడ నల్లే యుండఁగలను.

సుదేవుఁడు:- (ప్రవేశించి దమయంతినిఁజూచి సందేహాత్తో) ఈమె మున్నుఁ జూచినయామెవలె నున్నది. ఐన నిప్పుడు

చం. ఎగసనఁద్రోచి చుట్టి కదియించి బిగించినయేక వేణితో
సగమయి శోధనం బెపుడు సల్పమి మాసినప్రాతచీరతో

నగపడి గట్టువాలుగతి నార్తతవాడినమోముదమ్మితో
వగ నిగిడించుచున్నయది వారిజలోచన యీమెయెవ్వరో! 1

చం. కనుఁగొనినాఁడ భీమనృపకన్యక నప్రతిరూపదీపితన్
గనకఁపుబొమ్మవోలె మునుఁగన్నుల కింపుఁదనర్చుచుండె నేఁ
డనయము చిక్కి ఖిన్నయయి యార్తిసమాకలితాత్మ మూర్తియై
వనరుచునుండె నేలొ తనుపాకమునొందిన శోకమో యనన్. 2

చం. అమనసనాఁటిచంద్రకళ యట్టులు వేసఁగి నేఱుకై వడిన్
హిమసమయంపుతమ్మివలె హీనతనుద్యుతి యాటఁజూడ శో
కము గలిగించె నాకె యెటు గాంచి సహించునొ తండ్రి యింక ని
క్కముగ నె తల్లి యీసుతనుఁగన్గొని యోపిరిఁ దాల్ప నేర్చునే. 3

పాపాత్ముఁ డగుపరమేష్ఠి నింద్యుఁడే. ఏలన,

తే. గీ. సదృశదాంపత్యసంభావ్యసౌఖ్యగరిమఁ
జూచి వీరికి నెడబాటు చొనిపె ధాత
యొక్కచో నన్నిగుణములయునికి కతఁడు
సహజశాత్రవవిఖ్యాతివహుఁడు గాన. 4

చం. పతియెడఁబాటుచేత నిజభాసురవేషము మాయుటన్ హిమా
గతి దళహీనమై నిలుచుగందపుకొమ్మవలెన్ స్వకీయమా
స్థితి గనిపట్టనీయక కృశించినయట్టి నిజాంగవల్లితో
నితరయ యన్నభావ ముదయింపఁపగఁ జేసెను మాఱురూపునన్.5

అబ్బా! యెట్లోకృతకృత్యుఁడనైతి, గాని యీమె నన్ను గుర్తుపట్టినట్లు గనఁబడుచున్నది. ఇది యెట్లు. అని మెల్లఁగా నిటు నటు నడచును.

సైరంధ్రి:- తనలో ఎవరో యీయన హర్షశోకములతో నానంద భాష్పములు గలదృష్టితో నన్నాసక్తితో వీక్షించు చున్నాఁడు. ఆహా! ఈయన మా నాయనగారికి శివపూజఁ

జేయించు నుపాధ్యాయుఁ డగు సుదేవుఁడే, ఎట్టు లీయనముం దఱ నిట్టి నా యాకారము గనఁబఱతును. ఈయన యెదుర నేనెట్లు నిలువఁ గలను. [అని తెలియనట్లింకొక వైపుఁజూచు చుండును.]

సుదే:- (తనలో) అయ్యో! యీమె నన్నుఁ దెలిసికొనియే యెఱుఁగ నట్లు మొగము మరల్చు చున్నది. అది యుక్తమే!

ఆ. వె. హితుల చేరుగడయె హేతువు వ్యథ కగు
కష్టదశయె గాదు కారణంబు
పలుకరించువారు పజ్జన లేకున్న
దుఃఖ మున్నవిధమె దోపదుగద! 6

ఆ. వె. సిరులు దొలఁగినట్టి నరులకు నిజముగాఁ
గ్రొత్తచోట నునికి గూడియుండు
రశ్మిరహితుఁ డుష్ణరశ్మి నిత్యంబును
వారిరాశియందుఁ బడునుగాదె. 7

ఇట్టి దుర్దశ యొకరి కననేల. ఎందఱికో గలదు. ఎట్లన,

చ. ఉడుపతికిఁ క్షయోపగతి యుష్ణగభస్తికి రాహువేధయుం
బుడమి కనేకభర్తృత బుభుక్షునకుం దితిజేంద్ర బాధయుం
గడలికి బాడబాగ్ని సురకాంతల కెప్పుడు వంధ్యభావ మీ
వడువునఁసృష్టి నెందఱికొ వర్తిలు చుండవె దుఃఖయోగముల్. 8

అదియుండుఁగాక! ఎట్లో యీమెయొద్దకుఁబోయి నమ్మకము గలిగించి యూఱడించి వచ్చినపని తీర్చికొనవలయు (మెల్లఁగాసమీపించి చేయెత్తి హర్ష ఖేదములతో)దమయంతికి శుభము గల్గుగాక! (అని యాశీర్వదించును)

సైరంధ్రి:- (భయలజ్జాదుఃఖములతో తనలో) ఈయన యెట్లు నన్ను నిస్సందేహముగాఁ దెలికొనియెను. ఇఁక నెటులీయన తో సంభాషింతును.

చం. ఎటఁజనె నీ మనోహరుఁ డేఁటేల వియోగము సంభవించె నీ
వెటులిఁక గట్టువాల్ సిత్థివహించితి పట్టఁపుదేవి చూచి న
న్నటు మొగ ముంచి తేకతననంచు నితం డడుగంగలండొ నే
నెటు లెదురై మహీసురున కిన్నిఁటికిం బదులేమి సెప్పుదుఁ. 9

విచారింపనేల? అవమానము వెల్లడించుటయు నావశ్యకమే. (ప్రకాశముగా వినయముతో) స్వామీ! అనుగ్రహించితిరి. గుర్తుపట్టఁజాలక యపరాధ మొనర్చితి. క్షమింపుఁడు. (అని కన్నీరుగార్చుచుఁ జేదోయితో మోకాళ్ళు నేల నునిచి వందనము సేయును.)

సుదే:- శుభవతీ! లెమ్ము లెమ్ము. ఇందపరాధ మేమియున్నది? ఇఁక నిందవమానముగాని సమ్మానముగాని యేదియున్నను నేదియుఁ దోఁపక చాలకాలమునుండి దేశమంతయుఁ దిరుగు నాకు నదృష్టవశమున నీవు గనఁబడితివి. అద్దియే మాకుఁ బదివేలు.

ఉ. చీఁకున కీక్షణాగమము చేనునకు న్దటిఁగల్గువానయుఁ
జీఁకటిలోని మానిసికిఁ జిత్రగభస్తి సమిద్ధకాంతియుఁ
వాఁక మునుంగువాని కుదవాహిని పెన్నిధి పేద కిట్లు పే
రాఁకటఁ గ్రుగ్గువానికి వరాన్నమువోలెను నీవు నాకిటఁ. 10

సైరం:- (స్తంభము నూతగాఁ గొని చాటున నిలుచుండును.)

సుదే:- అమ్మా! నీ కిపుడు శోకాగ్నిఁ బ్రజ్వలింపఁజేయఁగలనుగానఁ గొంచె మోర్చికొనుము. ఏలన నాడెందము మీదంపతుల చరిత్రముఁ దెలిసికొనఁ దలఁచి వాక్కునుఁ దొందర చేయుచున్నది. గాన చెప్పుము.

సైరం:- (నిట్టూర్పువిడిచి) భగవంతుఁడా! పుణ్యపురుషులు పాఁపురాలి చరితము విననేల?

సుదే:- అమ్మా! దీనికన్నఁ బావనచరిత మింకొకటియున్నదా! లేదు గాన పూర్తిగా వినిపింపుము.

సైరం:- ఆలింపుఁడు.

మ. కదలన్ గాన హరించె నాథుపటముఁ గావంబ ముద్భ్రాంతమై
యదియే యాదిగ నేకవస్త్రిణముగాఁ నందుండుచో నంతనే
నిదురం జెంద

(అని సగము చెప్పఁగనే స్మరణము నభినయించి కన్నీరు గార్చుచు) హా దైవా! (అని మూర్ఛఁబోవును)

సుదే:- శుభవతీ! సంతాప మొందకుము. ఊఱడిల్లుము. ఇది కడచినది చెప్పుటయేగదా! (అని పంచెతో విసరుచుండును)

సైరం:- (తెలివినొంది ఖేదముతో) మిగిలినదియుఁ జెప్పవలసినదే.

సుదే:- తప్పక చెప్పవలయు. ఎట్లో యదియుఁ జెప్పుము. త్వరలోనే నీకు మేలు గలుగుత.

సైరం:- భగవానుఁడా! మీయాశీర్వాదము ఫలింపవలయు. అదియు నెట్లో విన్నవింతును.

"విభుండు వోయె నెటకో నన్యాసి ఘోరాటవిన్"

(అని సగము చెప్పఁగనే గన్నీరు విడుచుచు) ఆర్యా! ఈ యతిపాపురాలిచరితము విననేల? ఇది చెప్పుటకు నా నాలుకయు నొప్పుకొనదు.

సుదే:- వత్సా! అంతయు వినినపదంపడి నీయాపదకుఁ దగిన ప్రతిక్రియ సేయనగునని యేను సెప్పినను సంతాపపడియెద వేల? మిగిలినదియుఁ జెప్పుము.

సైరం:- పుణ్ణెము సేయనివారియాపదలకుఁ బ్రతీకారముండదేమో యని నాకుఁ దోఁచెడిని.

"వెదుకన్ సాగియు నెందుగానక విభున్ వేసారి యే తెంచితిన్" 11

(కన్నీరుగార్చుచు ఖేదముతో) యేమి? పితామహుఁడెంత పరోత్కర్షాసహుఁడు. ఈదుర్దశ తొలఁగునా?

మ. కులశీలంబు లపారమౌ సిరియు నాకుల్ వేఁడు సౌందర్యమున్
దులితుం డన్నిఁట భర్త యిద్దఱును నన్యోన్యానురాగంబు వి
వ్యాలతన్ వ్రాసి విధాత యాత్మనియమ ధ్వంసంబునన్ రోసి, య
వ్వాలఁ జేర్చెన్ విరుపుల్ చిరార్జితయశోభంగా సహాస్వాంతుఁడై.

పరమేశ్వరేచ్ఛ యిట్లున్నది.

చం. జనితచరాచరుం డయిన శంకరు నక్కటికంపు చూపునన్
జనులకుఁ గల్గు సర్వవిధసంపదలున్ స్పృహణీయ భోగముల్
మునుపటి జన్మమం దభవుఁబూజలఁ దన్పనియట్టివారి దా
ననుగతసంచితానుభవ మన్యవిధంబుగ నుంట యబ్రమే. 13

ఉ. శీలము బాయకుంటి నిఁక శేషవిభూషణుఁ గొల్చుచుండితిన్
శూలి యనుగ్రహించినను శోకసముద్రమునందు ముంచినన్
మేలిపుడొందగల్గినను మీఁదటిజన్మమునందు గల్గినన్
గాలము వేచుచుండితిని గాదగునర్థ మిఁకేమి గల్గినన్. 14

భగవానుఁడా! మీరు ముఖ్యముగా నాకీయుపకారము గావించి యనుగ్రహింప వలయును. ఏదియన,

చం. పరుల కెఱుంగరానిగతి భస్మమునందున నగ్నివోలె వా
సరములు నెట్టుచుండితిని జాల ననుగ్రహ మొప్ప మీరు నా
వరుచరితంబుగాని యిఁక భైమిని నేననిగాని యెందు నె
వ్వరికినిఁ జెప్పకుండకయ వైశమవోవఁగ మిమ్ము వేడెదన్.

(అని భక్తితోఁ బాదములమీఁదఁ బడుచున్నది.)

(తెరలో)

సైరంధ్రీ! నీ వృత్తాంత మేమి. నీ భర్త యెవ్వరు బ్రాహ్మణోత్తముని వేఁడుచున్నదాన వేల?

సైరం:- విని భయముతో వడఁకుచుఁ గన్నీరు విడుచుచు) అయ్యో! మహారాజువారి మాటవలె నున్నది. ఇఁకగతియేమి. దైవమే నా వార్త వెల్లడి చేసెను. (అని యేడ్చుచున్నది)

సుదే:- నీవు దుఃఖింపనేల. దేవుఁడు మేలే చేసెను. నీ వృత్తాంతము వెల్లడి యగుటయే శ్రేయస్కరము.

సైరం:- మీరు సర్వజ్ఞుల రయ్యు నిట్లు వలుకుదు రేల. నా వృత్తాంతము వెల్లడి యైనపిదప నేను వీరియెదుర నెట్లునిలువఁ గలను.

సుదే:- నీ విటనుండిన నేమి ? మహారాజని పెద్దబిరుదు వెట్టుకొనిన సుబాహు నిటకు రానిమ్ము. ఇతఁడు నీ భర్తయగుఁగుదమ్మల నీడనుఁగూడ నుండఁదగఁడు గదా !

సైరం:- భగవానుఁడా ! కానవేగదా నేనును లజ్జవడుచుండిని.

సుదే:- కాల కౌటిల్యమును గూర్చి యేమి సేయవలయు. ( అంతట సుబాహువు తల్లితో సునందయు ప్రవేశింతురు.)

సుబా:- సైరంధ్రీ ! నీ వృత్తాంత మేమి (అని మొదలుగా నడుగును)

రాజమాత:- సునందా ! ఈమె యెవ్వరో చాలఁగష్టములో నున్న రాజకన్యకవలె నున్నది. ఏలన,

చం. మృదుమధురంపు మాటయును మేలిమివర్ణఁపు గాత్రవల్లియున్
మదగజమందయానము సుమంబులు దాఁకినఁ గందు చేతులున్
వదనము పద్మసౌహృదము పల్లవశీలము పాదయుగ్మమున్
గుదురుగ నివ్వి మాలకరికోమలి కెందును గల్గనేర్చునే. 16

చం. పలుమరు నేమియో దలఁచి బాష్పము సోనగఁగార్చుచుండు లో
పల మతియేలొ చింతిలుచుఁ బట్టుగ వేఁడినఁ జెప్పకుండు భూ
తలమునె చూచుచుండియును ధ్యానముసేయుచునుండు నెద్దియో
లలన విధంబుఁజూడ బహుళంబగు నాపదయున్కి దోఁచెడిన్. 17

చం. తెగడికమాటలేవయినఁ దెప్పునఁ గొల్వున సంభవింప నె
వ్వగఁగనుదోయి నీర్నినుచుఁ బల్కదిఁకక్కర మొక్కటేనియున్
నెగులునుఁ దెల్ప దేమియుఁ గణింపదు కష్టగణంబు భక్తి నీ
మగువ వహించుఁదృప్తి నణుమాత్రన నోరిమి నేమిచెప్పుదున్. 18

చం. నిలుపదు చూపు నెల్లపుడు నేలనెగాక యొకప్డు వేఱుచో
నిలువదు నల్వురుండు నెడ నేరిమి నెందునుఁ జూపదేమియుఙ
బలుకదుసుమ్మి బిగ్గఱగఁ బల్మరు నత్యధికంబుగాని యీ
చెలువ వసించువార్త యిఁకఁ జేరువవాని కెఱుంగవచ్చునే. 19

సునంద:- అమ్మా! ఈమె మహాపతివ్రత చాలఁగష్టములో నున్న రాజకన్యయని నా కిదివఱకే తోఁచెను.

సైరం:- (వినయ భయకంపములతోఁ గన్నీరుఁ దుడుచుకొను చుండును)

సుదే:-అదృష్టముచేత సుబాహువు తల్లితోఁ జెల్లెలితోఁగూడ నిటకే వచ్చుచున్నాఁడు. ఇది చాల ననుకూలము.

సుబా:- (ఎదురఁజూచి తనలో

తే. గీ. మూఁడవువిభూతిరేఖల మోము మెఱయ
నురమునందున జన్నిద మొప్పుచుండ
వగఁబొగలు నట్టి యాగట్టువాలుతోడ
మాటలాడెడు నీ విప్రమహితుఁ డెవఁడొ. 20

సైరంధ్రియు నీయనయెదుర గురునొద్ద శిష్యురాలివలె భయ వినయములతోఁ గూర్చుండి కన్నీరు గార్చుచు నేమియో చెప్పుచున్నది. సైరంధ్రి నన్నుఁజూచి భయపడునట్లు గాని పించు చున్నది. కానిమ్ము దగ్గఱకుఁబోయి యీవృత్తాంత మంతయుఁ దెలిసికొనెదగాక. (అని సైరంధ్రిని సమీపించును, రాజమాత సునందతో సమీపించును.) బ్రాహ్మణోత్తమా! ఏను సుబాహుఁడనువాఁడ అభివాదనము సేయుచున్నాఁడను.

సుదే:- భద్రుఁడా! నీవు శుభకరము లగు బాహువులు గలవాఁడవు కమ్ము.

సుబా:- స్వామీ! తపముచే నేదేశము తమచేఁ బవిత్రీకరింపఁబడి యెనో తమ కటాక్షవీక్షణమునకుఁ బాత్రుఁ డగుశిష్యు

డెవ్వఁడో మహాత్ములు సైరంధ్రితో మాటాడుచున్నారు. ఆపెపున్నె మేమో తెలిసికొను కుతూహలము గలిగియున్న వాఁడ.

సుదేవు:- ( చిఱునగవుతో ) అంతయు వివరింతును. జననితో మీరు గూర్చుండుఁడు.

సుబా:- (అట్లేయని వినయముతోఁ గూర్చుండి) అనుగ్రహింపుఁడు. అవధానముతో నున్నాఁడ.

(రాజమాతసునందలు సైరంధ్రిప్రక్కన నుందురు. సైరంధ్రి కన్నీరువిడుచుచుఁ దలవంచి యూరకుండును)

సుదే:- చెప్పుచున్నాఁడ. అవధానముతో నుండుఁడు. నా పేరు సుదేవుఁడు. విదర్భదేశాధిపునకు శివపూజ సేయించు చుండువాఁడను. భీమమహీపతి కూఁతును వెదకుటకై పలువుర నని చెను. వారిలో నేనొక్కఁడను ఈమె విదర్భాధిపతి కూఁతురు. (అని సైరంధ్రినిఁ జూపి కన్నీరు విడుచును)

సుబా:- (ఆశ్చర్యముతో) ఎట్లు ? ఈమె భీమమహారాజు కొమరితయా? ఇఁక చక్రవర్తి పట్టపుఁదేవి దమయంతియే.

రాజమాత:- (వెంటనే లేచి కౌఁగిలించుకొని కన్నీరుతో) బిడ్డా! నీవా యిట్లైతివి. నీగతియు స్థితియు నిట్టులున్నదా. హావత్సా! హా నిషధేశ! హా దైవమా! హా నీలకంఠా! (అని మూర్ఛవోవును )

సైరం:- హా నాథ! హా శంభో! ( అని సొమ్మసిల్లును )

సునంద:- అమ్మా! అక్కా! విచారపడకుఁడు. ఊఱడిల్లుఁడు. ( అని వస్త్రముతో విసరుచుండును )

సుబా:- అయ్యో! దమయంతి యిట్లున్నదా! నిషధమహారాజు పట్టపుఁదేవి మాకు సైరంధ్రియా! ఔరా! దైవగతి యెట్లున్నది మానవులదశ యెట్లు మాఱుచుండును? (విషాదవిస్మయస్తంభమును నటించును)

సుదే:- (ఖేదముతో తనలో) నేను యథార్థము నిట నేల చెప్పితిని? బ్రాహ్మణ స్వభావమే గాంభీర్యము గలది గాదు. అందును పౌరోహిత్యమునకుఁ జాపలము సహజము. ఇప్పుడేమి సేయుదు. (ఆలోచించి) బాంధవులకు రహస్యము దెలుపుటయుఁగార్యము నకు సాధకమే యగునుగాని బాధకము గాదు. కానిమ్ము. వీరల నూఱడింతునుగాక! (ప్రకాశముగా) వత్సలారా! విచారపడు టేల? కడచినదానికి వగచిన నేమిలాభము? ఇఁక గర్తవ్యనిర్ణయ మావశ్యకము. (రాజమాత సైరంధ్రియుఁ దెలివినొందుదురు)

రాజమాత:- బిడ్డా! నీవు నాయక్కకూఁతురవు. కాననే నీ యీ యవస్థ నాకు వ్యాకులతఁ గలిగించెను. హా వత్సా!

ఉ. భీమమహామహీవిభు నివేశమునందు జనించి సర్వమా
భూమికిస్వామియౌ సకలభూపతిసేవ్యుని ధర్మపత్నివై
యామహనీయమౌ విభవ మంతను బాసి భయంకరాటవీ
సీమఁ జరించి కష్టములఁజెందు మటంచు విధాత వ్రాసెనే. 21

చం. అతివలజన్మ లోకమున హైన్యపదంబయియుండు నందునన్
బతియెడబాటు వాటిలిన భామిని జీవనమే వినింద్యమౌ
నితరవశంబునం దునికి యింకను నీచము గాదె భీమరా
ట్సుత విధి యిన్ని నీనొసట చోద్యముగా నెటు వ్రాసెఁ గ్రూరుఁడై.

తే. గీ. వృద్ధవనితలచేతుల వెలసి తాది
బిదప సఖురాండ్ర బుజములఁబెరిగి తవల
నిషధపతియంకతలమున నిలిచి తిపుడు
నేలఁ బొర్లెడుదశ యెంతనీచ మొదవె. 23

చం. జనపతిభీమునాత్మజగ జాయనుగా నలచక్రవర్తికిం
బనుపడఁజేసి యీదశను బైనొడఁగూర్చిన ధాత శైలపుం
గొనదను కెత్తి జంతువును గొబ్బునఁ నేలనువైచె మానవున్
దనర నలంకరించి తల దబ్బునఁద్రుంచెను నిక్కువంబుగాన్. 24

దమయంతీ! నీపేరు మున్ను బంధువులకు మదమును గలిగించుచుఁ బృషోదరాది పాఠమున వర్ణవ్యత్యయముచే సాధువయ్యెను. ఇప్పుడన్ననో హర్షము'నడంచుటంజేసి సహజముగనే సాధువయ్యెను. హా దమయంతీ! (అని కౌఁగిలించుకొని యేడ్చుచున్నది.)

సుబాహు:- అమ్మా! దుఃఖింపనేల? ఇదంతయు దైవవిలాసముగదా! మఱియు నీవును శోకించుట దమయంతి శోకవహ్ని నూఁదుట గదా! కాన భైమి నూఱడించి నీవు నూఱడిలుము. (అని తల్లి కన్నీరు వస్త్రముచేఁ దుడుచును)

రాజమాత:- [కన్నీరు బిగపట్టికొని] బిడ్డా! శోకింపకుము. దినములన్నియు నిట్లే యుండవు. సంతసపడుసమయము రాకుండదులెమ్మ.

సునంద:- అక్కా! లెమ్మ. ఇంతఁదనుకఁ గాఱిన నీకన్నీరుచేఁ దడిసిన దైవకేదారము ఫలింపకుండునే! ఊఱడిలుము. [అని విసరుచు లేవఁదీయుచున్నది. సైరంధ్రి తెలివినొంది లేచి] బాంధవులు ప్రియోక్తులుపలుకుట యున్నదేగాని యభాగ్యురాలి కట్టి దైవానుకూల్య మెట్లు గలుగును? ఏను దుఃఖమనుభవింపనె పుట్టితిఁగదా.

రాజమాత:- స్వామీ! ఏమును గనిపెట్ట నలవిగా నట్లు మాఱురూపొందిన యీదమయంతిని మీ రెట్లు కనిపెట్టితిరి?

సుదే:- వినుఁడు. ఈమెకుఁ గనుబొమలనడుమ తమ్మిమొగ్గవలెనొక్కటియు, మడమలయందు రెండును దీర్ఘసౌమాంగల్య

మును మహైశ్వర్యమును సూచించు పుట్టుమచ్చలు గలవు. అదిగాక యీమె కేశపాశ మప్పుడు విచ్చిన సురపొన్నపూవుల పరిమళము గలిగియున్నది. ఈలక్షణములఁబట్టి సులువుగనే దమయంతియే యీమె యని గ్రహింపఁగల్గితిని.

సైరంధ్రి:-

తే. గీ. అణువులోనుండి మఱి పరమాణు వగుచు
వేదముల కైన వివరింప వీలుగాని
బ్రహ్మతత్త్వ మెఱింగిన బాడబులకు
నెఱుఁగరానిది జగమున నేమిగలదు. 25

అదియుండుగాక! మందభాగ్య నగు నా కిఁక నేమి జరగునో తెలియదు. మాకు మేలు గలుగుదారియే తోపదు.

తే. గీ. ద్యూతమున సర్వసంపదల్ దూలిపోయె
నెఱుకపడ దాయెఁ బతివసియించుతావు
భర్తృయోగంబు సర్వసంపదలప్రాప్తి
య నెడునీరెంటియందు నా కాశ లేదు. 26

ఆ విషయమునఁ బరమేశ్వరేచ్ఛ యెటు లున్నదో!

రాజమాత:- బ్రాహ్మణోత్తమా! భైమికి మంచి యదృష్టము గలదా? పూర్వమువోలెఁ బరిపూర్ణభాగ్యమును భర్తృసమాగమమునుఁ బొందినదమయంతినిఁ జూతుమా?

సుదే:- మీ రిట్లు సంశయింపఁబని లేదు.

తే. గీ. కలుగు భీమాత్మజకు మంచికాల మింక
నపుడు సంపద లన్నియు నలముకొనును
ఎండకాలమునందెండి యిసుక మిగులు
నేఱు ప్రవహింపదే వర్షఋతువునందు. 2

( తెరలో శంఖధ్వని )

సుబా:- స్వామీ! ఉపశ్రుతి యీ దంపతులకు మేలు గలుగు నని తెల్పుచున్నది.

సునంద:- అక్కకు మంచికాలము త్వరగా రావలయు.

సుదే:- మధ్యాహ్నసంధ్యాకాల మాసన్న మైనది.

సైరం:- జనులకు జీవయాత్రయందు సుఖముగాని దుఃఖముగాని మెఱకపల్లమును గల నేలఁ బ్రవహించు జలముఁ బోలి విషమముగానే యుండు గదా!

సుబా:- బాగుగా నున్నది. పోవుదము. (అని యందఱు పోవుదురు.)

ఇది భారద్వాజసగోత్ర శ్రీజ్వాలాంబికా ఘోరనాథా
రాధ్యపుత్ర బుధజనవిధేయ నాగలింగాభిధేయ
కృతి విశేషమగు నలప్రవాసమునందు
నాయికాజ్ఞాతవాస మను
షష్ఠాంకము.

---

శ్రీ

శివాభ్యాంనమః

# నలప్రవాసము

## సప్తమాంకము

(అనంతరము సంతసముతో త్వరగాఁ బర్ణాదుఁడు ప్రవేశించు చున్నాఁడు.

పర్ణా:- కృతార్థుఁడ నైతిని. రాజపుత్త్రికయాజ్ఞ యిప్పటికి నెఱవేర్పఁ గలిగితిగదా! అది యేమన "బ్రాహ్మణోత్తమా! నీవు క్రమముగఁ బ్రతియాస్థానమునకుఁబోయి యటనట నీపద్యముఁ జదువుము.

సీ. సుగుణాలవాలుండు సూనృతశీలుండు
శ్రితజన రక్షణవ్రత మహితుఁడు
సార్వభౌముండును సర్వవిదుండును
సారైకదర్శియు సరళమతియు
మఱి మహావీరుండు మన్మథాకారుండు
నతులిత ప్రజ్ఞా సమన్వితుండు
సదయహృదయుఁ డింక సరసవాగ్విభవుండు
నిర్ధూత దోషుండు నిస్పృహుండు
తే. గీ. నైన యవనీశ్వరుఁడు గాన యందు గృహిణి
నమ్మి నిదురించుచుండ నాయిమ్మ గాంచి
సగము చీరఁ జించి యద్ది సంగ్రహించి
పోయెఁ గంటిరె చెప్పఁ డాపురుషు నునికి. 1

ఈ పద్యము చదివి దీని కెవ్వాఁడు బదులు చెప్పునో వాని యాకారము నధికారము నివాసము బాగుగాఁ దెలిసికొని రమ్మని యానతిచ్చెను. ఏను సాకేతమున ఋతుపర్ణునాస్థానమున నీ పద్యమునకు నుత్తరము చెప్పినవానిం గంటిని. అతఁడు సాకేతాధిపతివలన నెలకు నూఱువరహాలు వేతనము దీసికొనుచు గుఱ్ఱములకు నాట నేర్పుచున్నాఁడు. (స్మృతి నభినయించి మెచ్చుకొనుచు) బాహుకా! ఎంతబాగుగాఁ జెప్పితివి. ఇట్లు చెప్పితివి గదా!

అష్టపది సీసము

ఎఱుఁగుదు నాతని నిన్ని లక్షణములు
గలవాఁడె యగును నిక్కంబుగాను
నేర మాతని యందు నిలిపితి వీవట్టి
దోష సంగతికిఁ బాత్రుండె యతఁడు
సమయంబునుం బట్టి సకలంబుఁ గావించెఁ
గ్రౌర్య మాతని యందుఁ గలుగఁబోదు
కాంత గూడ నున్నఁ గష్టములంబడు
చుట్టాల యిలుసేర సుఖము నొందు
తెలుప నూలుకొనమి మెలఁకువతఱిగాక
నిదురవోవుహాదనె కుదురు ననుచుఁ
బక్షి తనదు కట్టుపంచ హరించుట
లలన చీర జించి మొలకుఁ జుట్టె
యెందొ డాగఁ బోయెఁ గుందుచు నాతండు
కాలగతినిఁ బట్టి కార్య మయ్యె
నతని యందు దోస మావంత యేని విధాత
కైనఁ జూపఁ దరము గాదు
తే. గీ. సాక్షులు దేవల్ సర్వ కర్మములకు
నిందుఁ గల నిజంబు నెఱిఁగియుందు

రందుఁ గల నిజంబు నాతఁడె యెఱుఁగుఁగా
యింక సర్వసాక్షి యీశుఁ డెఱుఁగు. 2

అని చెప్పితివి గదా! ఈ యుదంతము రాజపుత్రికిఁ దెలుపుట యే నాపని. అనంతరకృత్యము దమయంతి యిష్టము. నే నిప్పుడు కుండినపురము సేరితిని. తొందరగాఁ బోయి యామెకుఁ దెలుపుదును గాక! (అని పోవును)

ఇది శుద్ధ విష్కంభము.

(పిమ్మట నాస్థానమునందు ఋతుపర్ణుఁడు మంత్రి సుబుద్ధితోఁ గూడఁ బ్రవేశించును.)

ఋతుపర్ణుఁడు:– నలుదెసలఁజూచి సంతసముతో) ఆర్య! యిది యెట్లు? ఏ మన

చం. సరయువు పాఱుచున్నది ప్రశస్తజలంబయి మందు వేసఁగిన్
గరులు మదించు నెల్లపు డగంబులు పుష్పఫలానతంబులౌ
ధర పరిపక్వసస్యఫలదర్శిత సర్వజనానుమోద మా
పురి యమరావతిం దెగడు భోగ్యకదంబనితాంతపూర్ణమై. 3

ఉ. వైర మదృశ్య మయ్యె మృగవర్గమునందును దూరదేశ సం
చారము వోయె భీతి యిఁక శాంతి దనర్చె జనాశయంబులన్
నేరము లిచ్చటన్ నిలువ నేఱక వోయె నెటో కనంగ నీ
యూరిపుడొప్పె నొక్కపురుషోత్తముఁగూడి సుఖించుచుక్కై వడిన్.

ఆ మహాపురుషుఁ డెవఁడో తెలియునా? అట్టి మహాత్ముఁ డుండుటనే గావలయు జనులు కేవల ధర్మపరులుగ నుండిన కతన నే నీ యాస్థానమండపమునఁ బొమ్మవోలెఁ గదలకుండ నున్నాఁడను.

సుబుద్ధి:– (తనలో) అంతవాఁడు బాహుకుఁడే యగునేమో! ఏ మన నతనికి

చం. కుఱుచన యైనమేను గన గొప్పఁదనంబునె తెల్పుచుండెడిన్
గఱుకుగ నున్న మాట యతిగాఢవివేకము వెల్లడించెడిన్
జఱుకుగ నున్నఁజూపు దయచొప్పనె తక్కక వెల్లడించెడిన్
గుఱుతులు నిన్నిఁగూడియు నిగూఢమహాత్మత నిర్ణయించెడిన్. 5

చం. ఇతరులవోలె వేతనము నెక్కువ వేడఁడు స్వల్ప మిచ్చినన్
హితవుగఁగైకొనున్ శ్రమము హెచ్చినఁ జెప్పఁడు దుష్టవాహసం
తతి గనినంత హస్తమునఁ దాఁకకయే యలవర్చు వీని నే
కతనను డాఁగియుండిన యగణ్యగుణాలయుఁగాఁ దలంచెదన్. 6

ఈ సుస్థితి కంతకు హేతుభూతుఁడు బాహుకుఁడే యగు నేమోయని తోఁచెడి. కాని యాతఁడే యని యెట్లు నిర్ణయింపవలయు? అదిగాక యీ సుస్థితి యంతయు దేవరవారి పుణ్యాతిశయముచేతనే కలిగె నేమో.

ఋతు:- మననగరమునందు మహాత్ము లెవరైనఁగల రేమో వెదకుము.

సుబు:- దేవరయాజ్ఞ.

(పత్రికఁ బట్టుకొని వార్తాహరుఁడు ప్రవేశించును.)

వార్తాహరుఁడు:- దేవ! యీ లేఖ విదర్భాధిపతిచే ననుపఁబడియె.

(అని పీఠముమీఁద పత్రిక నుంచును.)

ఋతు:- (కౌతుకముతో విస్మయముతోను) ఏమి యిది! అకాలమున నకస్మాత్తుగాఁ బ్రియసఖునియొద్దనుండి లేఖ వచ్చినది. ఇది చదివి వీనులఁ దనుపుము.

సుబు:- దేవరవారి యాజ్ఞ. (అని పత్రికవిచ్చి చదువును.)
"సూర్యవంశముక్తామణియు సకలమహీపాలమౌళిలాలితలలితచరితుండును, రాజర్షియు, ప్రియసఖుండునునగు ఋతుపర్ణునకు స్వస్తి యగుగాక! ప్రియసఖుఁడా! అనేక పరిరంభ

పురస్సరముగాఁ బ్రియమిత్రుఁ డనిచిన యీ చిన్ని విన్నపము నాలింపుము. ఏమన మీ మైత్రిచేతను బరమేశ్వరుని దయచేతను నిచ్చట మాకుఁ గుశలము. ఇట్లే మీ కుశలమును వినుకుతూహలము గలిగి యున్నాఁడ. ఇఁకఁ బ్రకృతము, కర్మముల విపాకము తెలియదు. భాగ్యదశలు క్షణికములు. స్త్రీజనము కార్యాకార్య వివేకరహితము. తల్లిదండ్రులు సంతతియభిప్రాయము ననువర్తింప నవసరము. కొందఱు నడచినదే యాచారము. గతానుగతికము లోకము ఇదియంతయు నాలోచించి నిషధపతిని వెదకించియుఁ బ్రియవియోగజన్యమగు పుత్రిక వ్యసనము గమనించియు, నిషధపతి యెటనున్నదియుఁ దెలియమిచే విరమించి కొమరితకుఁ బూర్వము వోలె నాభ్యుదయికకర్మము గావించి యామె వరించిన యుత్తముఁడగు వరునితో సమాగమము గావించుటకు రాఁబోవు దశమీ యిందువాసరమున సుముహూర్తము నిర్ణయింపఁబడియెను. కానఁ బ్రియమిత్రుఁడు రాజేంద్రులు గూర్చుండ ననువుగా నిర్మింపఁబడిన మంచములలో నొకటి యలంకరింపవలయు నని గాఢాలింగన పురస్సరముగాఁ బ్రార్థించుచున్నాఁడ. ఇఁకఁ దమచిత్తము మా భాగ్యము. భగవతి యగు భవితవ్యతయు నిమిత్తము లగు పలుమాట లేల? పెక్కుగాఢాశ్లేషము లవుగాక!

పార్థివ సం॥ వైశాఖ శు ౭ లు

ఇట్లు చిరతరానుగతనిర్భరస్నేహగర్భుఁడగు,

వైదర్భుఁడు, భీముఁడు.

ఓమ్ తత్సత్.

ఋతు:- (విని యాశ్చర్యముతో)

చం. సుతకు నియోగ మర్హమనుచుఁ విధి యెచ్చోటనేని నుండెనే
మృతునిఁగ నైషధుం దలఁచి మేకొననౌను పునర్వివాహముఁ
హితమెటు కామతృప్తికి యథేచ్ఛవిహారము చూడ నన్నిఁటఁ
హతిఁగనె భీముసన్మతి సుతాధిగతాధికమోహసంగతిఁ. 7

ఉ. కేవల ధర్మమూర్తి యని కీర్తిఁగడించె నలక్షితీశ్వరుం
డావసుధేశుసాధ్వి మదనాకులవృత్తిఁ బునర్వివాహ సం
భావన సల్పనేని నెట వర్తిలు ధర్మమెవండు వేదశా
స్త్రావళి విశ్వసించు నెటులౌర కృతంబున గెల్చితో కలీ. 8

సుబు:- మహారాజా! మీరిందు సంశయింపఁ బనిలేదు. పత్రికఁ జూడఁగాఁ బునస్స్వయంవరమునకు బలువు రంగీకరించినట్లును భీముఁడు వెఱచుచున్నట్లును దోఁచుచున్నది గానఁ బ్రియమిత్రుని విన్నపము మన ముపేక్షింపఁ దగదు.

ఋతు:- నిరాకరింపకుండుటనె యెల్లరు నంగీకరించినట్లు విశదమయ్యెడిని. ఎట్లైన నగుఁగాక! మనకుఁ బ్రియసఖునిమాట నిరాకరింప వలనుపడదు. (విమర్శించి) ఇప్పనికిఁ బౌరవృద్ధు లందఱు నెట్లు లంగీకరింతురు? అసత్యవార్త భీముఁడు మనకెట్టు లనుపును? కాన నిది తప్పక యగునట్లే తోఁచెడిని.

తే. గీ. వ్రాయఁబడె రేపటికె మీరు రమ్మటంచు
బహుళదూరము కుండినపట్టణంబు
ప్రియసఖునిమాట విడనాడ వీలులేదు
కౌతుకావహమైన దుర్ఘటమె చనుట. 9

సుబు:- వ్యోమయానముతో సులువుగాఁ బోవ నగును.

ఋతు:- (స్మరణము నభినయించి) బాహుకుఁడుండఁగా నింకొక సాధనము వెదకనేల!

సుబు:- వాకిట నెవ్వఁడు?

(బాహుకుఁడు ప్రవేశించి తనకుఁ గలిగిన శుభశకునము దలంచి వితర్కముతో)

తే. గీ. ఆశ సుఖమున నాకు లేదట్టులైన
నదఱెఁగుడివై పుబుజ మట్టియక్షితోడ
దైవవశమున జనులకుఁ దెలియకుండఁ
జెడుగు మంచియుఁగలుగుటఁ జిత్ర మేమి. 10

దీనిఫల మేమో గాంతుముగాక! (కొంచెము నడిచి యెదురఁ జూచి) ఇటనే మహారాజు మంత్రితో మాటాడుచున్నాఁడు. సమీపింతునుగాక. (అని సమీపించును)

రాజమంత్రులిద్దఱు:- (సంతసముతో) ఎట్లు! తలంచినమాత్రముననే మనోరథమువోలె బాహుకుఁడు వచ్చెను.

బాహు:- నిన్నప్రొద్దున నడిచిన దుష్టాశ్వములు మూఁడును శిక్షనొంది బాగుగనే నడుచుచున్నవి. తక్కువానిలోఁ బది మాత్రము చెడుసుడులు గలవి. అవిగాక యన్నియు శుభప్రదములే యగు. నీవార్త విన్నవింపనే యిటకు వచ్చితిని.

ఋతు:- మంత్రివర్యా! సందర్భము మన కనుకూలముగా నున్నది. అంతర్దృష్టిగలవానివలె బాహుకుఁడు మనము తలఁచినమాత్రముననే వచ్చెనుగదా! ఇప్పటికార్యవిశేషము దెలిపి సంశయము దీర్చికొందము.

సుబు:- మంచిది. (బాహుకునివైపు దిరిగి సఖుఁడా! బాహుకా! ఇప్పటివార్త వింటివా? ఏమన నలుఁ డెందున్నదియుఁ దెలియక కూఁతునకు రేపు పునస్స్వయంవరము నిర్ణయించి భీముఁడు రమ్మని మహారాజునకు లేఖ నంపెను. కుండినపురము చాలదూరముననున్నది. ఎట్లు పోవలయు? ఏమి చేయవలయు? చాలకష్టము సంప్రాప్త మైనది.

బాహు:- (విని యాశ్చర్యముతోను ఖేదముతోను తనలో)

ఉ. నిర్మలరాజసంతతి జనించినవాని కనాదిధర్మముల్
బేర్మి భరించుసన్మతికి భీమునకుల్ వరలబ్ధజన్మ యా
నర్మిలిపుత్రికిన్ సతి కనర్హదురూహపునర్వివాహ దు
ష్కర్మపువార్త యీకృతయుగంబుననే వినవచ్చె నెట్లికన్. 11

అట్లుగాక నిదియుఁగానగు. రాగాదులచే వ్యాకులచిత్తులై పెద్దలే ధర్మమార్గమునుండి జారుట సృష్టిస్వభావము. ఎటు లన కతఁడు భరద్వాజమును లిర్వురుఁ దమపత్నుల మార్చు కొనిరి. వసిష్ఠుఁడు పంచమాంగనంగూడెను. విధాతయుఁ బుత్రినే మోహించెను. కాన దమయంతియు వేఱొకని వరిం చుట యసంభావితము గాదు.

మ. అనృతోదంతము నెల్లదేశములలో వ్యాపింపఁగా జేసి యై
నను మద్వార్త నెఱుంగ భీముఁడిటు సన్నాహంబు గావించెనో

(ఆలోచించి)

విని పర్ణాదునివల్ల నాయునికి సంవిద్భూమియా భైమియే
నను రావింపనె పన్నినట్టి మిషయత్నంబంచు భావించెదన్. 12

కావునఁ గుండినపురము పోవ నాచిత్తము త్తలవడుచున్నది. ఇఁక వీరికి బదులు చెప్పెదను. ఆర్యా! ఇంతియే యగునా? మహారాజునకు సంప్రాప్తమైన కష్టము? నేఁడు ప్రొద్దుగ్రుంకక మున్నె ప్రభువు కుండినపురము నలంకరింప నగు.

ఋతు:- మాటలతో నేమి? మిత్రుఁడు చెప్పినమాట నెగ్గించుకొను గాక!

బాహు:- స్వామీ! క్రియనే ప్రత్యుత్తరము గావింతును. పోయె దను. (అని నమస్కరించి పోవును)

ఋతు:- అమాత్యా! కుండినపురము చేరిననేగాని నాతొందర తగ్గదు.

ద్వారికుఁడు:- (వచ్చి వినయముతో) మహారాజునకు విజయము కల్గుగాక! బాహుకుఁడు మనోరథంబుబోలు రథంబుతో వచ్చి మీరాక నిరీక్షించుచు వాకిట నున్నాఁడు. దేవరచిత్తము.
(అనంతరము మునికోలతో సారథి ప్రవేశించుచున్నాఁడు)

బాహు:- (తనలో) లజ్జాకరము నవమానకరము సహజసత్వ కుంతకంబును దాస్యమేగాని యిట్టిది వేఱొక్కటిలేదు. ఏనిప్పుడు నాభార్యనే పరిగ్రహింపఁగోరిపోవు సావిత్రునకు సాహాయ్యకము గావింపవలసివచ్చెఁగదా!

ఋతు:- ఏను తొందరగా స్వయంవరమునకుఁ దగిన యలంకారము గావించుకొని యేతెంతును. (అని యుఋుపుచుఁ బోవును)

బాహు:- (కన్నీరుగార్చుచు తనలో) నేనే కేవలము నింద్యుఁడ. ఋతుపర్ణుఁ డుత్తముఁడే. ఏలన,

చం. అడవినిఁ బాసివచ్చితి నిజాంగన నైన గృహంబుసేరి యా
పడఁతుక వేచి నన్ను బహుభంగులఁజూడ మదీయవార్త యే
ర్పడమిఁ బతింవరాత్వమును బొల్పడి పిల్చినఁ గామి యయ్యె నీ
యొడయనిదోస మేమి మన మోడకయీాతని నీసడింపఁగాఁ. 13

(ఆకాశముఁ జూచుచు)

ఉ. మున్ను స్వయంవరంబునకు మోహము నెమ్మదిఁబొంగ నేగుచుఁ
దెన్నన నేచెలింగుటెఁచి నిర్జరదాసుఁడనైతి నిప్పు డా
యన్నన కర్థికేఁ భటుఁడ నన్యులకుం బ్రియుఁదాచ్చు దూఁతగా
నన్ను సృజించెఁ గానలయు నాల్గుమొగంబులవేల్పు దుష్టతఁ.14

అప్పటిదానికన్న నిదియే విచారకరము. అప్పుడు దమయంతి నన్నే వరించునని నమ్మి దేవతలు నన్ను దూతత్వము నర్థించిరి. ఇప్పుడు భటుఁడ నైయున్ననన్ను నీతఁడు ప్రేరించుచున్నాఁడుగదా! నిజముగా నేను దుర్భగుఁడనే. ఏలన,

వేడుకబెత్తమునకు బదులుగాఁ జేతములుకోల. భద్రాసనమునకు బదులుగ నొగయు సంప్రాప్తము లైనవిగదా! (చేయి సాచి యాకసముఁజూచుచు) హా దేవా!

సీ. సకలవిద్యైశ్వర్య సంపన్నునకు నీకు
నితరసేవాకష్ట మెట్లు దెలియు
వామార్ధజానివై వర్తించునీ కెట్లు
గాంతావియోగార్తి గానఁబడును
సర్వదేశవ్యాప్తిసంగతుం డగునీకు
తెలియు విదేశంపు త్రిప్పట లెటు
కాలకూటవినీల కంధరునకు నీకు
విదిత మేగతి నగు విసపుబాధ

తే. గీ. దాననే యిన్నియిక్కట్లు దార్చి తీవు
శ్రోతలనె నాచరిత్రంబు స్రుక్కఁజేయఁ
గర్మఫలదాత నీ కెట్లు కరుణరాదు
చంద్రమఃఖండజూట పశ్యల్లలాట. 15
(స్మరణము నభినయించి)

మ. సకలద్వీపమహీపమండలముచే సంబాధ మాకొల్వునం
దకలంకం బగుగద్దె నెక్కి సచివన్యస్తాగ్రహస్తుండనై
యొకనింజూపున మాటచే నొకనిఁ జేయూగించి వేఱొక్కనిన్
బ్రకటప్రేమరసుండ నై యెపుడు సంభావింతునో సభ్యులన్. 16

అది యెక్కడ? ఇదంతయు నిత్యదుర్గతియం దున్ననా కెట్లు లభ్యమగు? (కన్నీరు గార్చుట నభినయించి భయసంభ్రమములతో) తొలఁగిపోయిన సామ్రాజ్యస్మృతి నాకు వ్యాకులతఁ గలిగించుచున్నది. కన్నీరుగార్పించునది యదియేగదా! సేవావృత్తియం దున్నవారు కష్టసుఖములఁ దలంపఁగూడదు. అదిగాక ప్రభువు పెండ్లికిఁబోవునపుడు నేను గంటతడి పెట్టుట బొత్తిగాఁ గూడదు. (కన్నీరు బిగపట్టుట నభినయించి) ప్రభు

వాలస్యము సేయుచున్నాఁడేల? (అని రాజమందిరద్వారము నిరీక్షించు చుండును. పిమ్మట వార్ష్ణేయుని చేయి పట్టుకొని ఋతుపర్ణుఁడు ప్రవేశించును.)

ఋతు:- సూతా! బాహుకుని సామర్థ్యము నీవును జూతువుగాక! ఇతనిమాటయందు నీకు నమ్మకము గలదా!

వార్ష్ణే:- భుజింపఁబోవుచుఁ గూరలరుచి నడుగనేల.

బాహు:- [తనలో] ఇతఁడు గదా

మ. సరిగంచుల్ గలపట్టుపాగ తల కాస్థంజుట్టి మేనైన క
స్తురిబొట్టొప్ప మొగంబునన్ రుచిర వాసోభూషణోద్భాసియై
చరణంబుల్ ధర నున్నఁబై నెగయుచున్ సంకల్పజాయత్తుఁడై
నరరూపొందిన కౌతుకంబో యన భూనాథుండిదే వచ్చెడిన్. 17

కలలోనైన నలభ్య యగువనిత యిపుడు స్వయంవరమున లభించునని నమ్మి వచ్చుచున్నాఁడు. అది యుచితమే.

ఉ. యౌవనమంకురించి మకరాంకమహాగ్రహ మావహింపఁగా
భావన సేయుచున్ సతము భామలచిత్రవిహారధోరణుల్
చేవ వివేక మార్జవము శీలము నాన శ్రుతంబు వృద్ధియున్
వావిరిఁ బాసిపోవుట వినాశము జెందుదు రప్రమత్తులున్. 18

పెద్దలే మదనునిచేఁ గలఁత పెట్టఁబడుచుండఁ బామరులఁ గూర్చి యేమి సెప్పవలయు. (ఆశ్చర్యముతోఁ జూచుచుండును)

ఋతు:- (సమీపించి) బాహుకా! ఏను తేరెక్కుదునా? (వార్ష్ణేయుని జూచి) సూతా! త్వరగా నెక్కుదము రమ్ము. (అని వార్ష్ణేయునితోఁగూడ రథారోహణము నభినయించును)

బాహు:- (తనలో నాశ్చర్యముతో) ప్రభువు చిత్తము వేగిరపాటుతో నున్నది. ఎట్లన, ఇది యింక నయోధ్య యేగాని కుండినపురము

గాదాయెను. ఇది స్యందనమేగాని స్వయంవరస్థలము నందున్న మంచముగాదాయెను. మెడలోనిది ముక్తాహారమేగాని వరణస్రక్కు గాదాయె. దగ్గఱనున్నవాఁడు సూతుఁడేగాని భైమి గాదాయెనని తలంచుచున్నాఁడు. కానిమ్ము. నాపని దీర్చికొందును. (అని కూబరమునఁగూర్చుండి ములుకోల పట్టుకొనుచున్నాఁడు)

ఋతు:- (బాగుగఁగూర్చుండి) బాహుకా! ఆలస్యము సేయనేల? గుఱ్ఱములఁ దోలుము.

బాహు:- ఇవిగో పగ్గముల వదలుచున్నాఁడ. (అని కళ్ళెముఁ గదలించుచుఁ దోలుట నభినయించును)

ఋతు:- ఇది యేమి? అవశకునము. (తనలో) నాకు భైమి లభింపదా? కానిచో నిట్లవశకున మేల సంభవించును? మనకు నిమిత్తములతో నేమి? భాగ్యమునకు నిమిత్త మీశ్వరుఁడే. (ప్రకాశముగా కోపముతోను బరిహాసముతోను) ఏమి? యీగుఱ్ఱములతోనె కుండినపురము తొందరగాఁ జేరుదమా? హయపరీక్షక! బాగుగా నున్నది.

బాహు:- మహారాజా! కొంచె మోపికతోఁ జూడుఁడు. వాయువేగముమించిన వీని గమనవేగము (అని కళ్ళెముఁ గదలించుచున్నాఁడు)

వార్ష్ణే:- మహారాజా! గుఱ్ఱము లిప్పుడు భయంకరమైన నడక నేయారంభించినవి.

బాహు:- (రథవేగము జూపి) మహారాజా! ఇప్పుడుగదా.

చం. తురగము లివ్వి తేలికను దూది జయింపఁగఁజాలుమేను లం
బరమున నైచునట్లు బహుభంగులఁజిత్రగతుల్ వహించుచున్
జరణము లాని వచ్చుతమఛాయనె దాఁటఁదలంచినట్లు సం
బరమునఁ బోవుచున్నవి ప్రభంజనుగెల్వను బిల్వనో యనన్. 19

ఋతు:- (చూచి) నిజముగా నీగుఱ్ఱము లుచ్చైశ్శ్రవమును మించి
నదే యగు. ఏలన,

చం. కనఁబడవయ్యె వృక్షములు గానఁగనయ్యెడి నవ్వి రేఖలై
కనులకుఁ గమ్మెఁ జక్కటులు గంపమునొందెడిఁగాయ మంతయున్
మనసునఁ జేవయుం దొలఁగె మానుపు మింక మహోగ్రవేగమున్
దనువునఁ బ్రాణముల్ నిలువు తక్కినయర్థ మదెట్లువోయినన్. 20

వార్ష్ణేయా! ఇట్టి సారథ్య మెందైనఁ గలదా!

వార్ష్ణే:- ఇట్టిది యుండునని యూహింపను శక్యముగా నున్నది. ఇది
యంతయు నాశ్చర్యకరముగా నున్నది. చూడుఁడు.

చం. ఇల నవరింతఁ జేసినటు లేకవిధంబుగ నుండె నెల్లయున్
నిలువక పాఱుచున్న వవనీరుహముల్ పురముల్ మహాగిరుల్
దళమగు క్రేంక్రుతిధ్వని రథాంగసముద్గతి యూహ్యమయ్యెడిన్
జలనము గొంచెమేని మనస్యందనమందునఁ దోఁప దేమియున్. 21

ఋతు:- బాహుకా! నీవు నిజముగా హయహృదయజ్ఞుఁడవే!
(వార్ష్ణేయు నుద్దేశించి) సూతా! అశ్వశిక్షానైపుణ్యమున
నింతప్రజ్ఞ యెవ్వనికిఁ గలదు. కాఁబట్టి

సీ. త్రిపురదాహమునందుఁ ద్రిణయను సూతుఁడై
వేదాశ్వచోదియా విధియొ యితఁడు
తారకుఁబోరఁ గుమారుని సూతుఁడై
యాజి చేరిన యా మహాబలుండొ
యాదిత్యసూతుఁడై యద్దేవు మెప్పించి
యుపదానమందు ననూరుఁ డొక్క
మును సురాసురుల కౌ భూరిరణంబుల
దర్శితశక్తి మాతలియొ యింక

తే. గీ. సుదితహయతంత్రుఁ డౌశాలిహోత్రమునియొ
కలితహయహృదయుం డగునలుఁడొయాతఁ
డొరుల కిట్టిసమర్థత యుండఁగలదె
గూఢముగ నుండె నెవ్వఁడో గొప్పవాఁడె. 22

కానిమ్ము గుఱ్ఱములఁ దోలునప్పు డీతని ముఖముఁ జూతును గాక! (లేచి ముఖముఁద్రిప్పి చూచుచునే యుత్తరీయము జారిపోవుట నభినయించి) ఉత్తరీయము పడిపోయె బాహుకా! రథము నాపుము. వార్ష్ణేయా! దిగి యుత్తరీయము దెమ్ము.

బాహు:- (నవ్వి) మహారాజా! ఉత్తరీయ మెక్కడఁబోయెను. దిగిపోయి యది తెచ్చుటకు వార్ష్ణేయునితో నెక్కడఁజెప్పుచున్నారు. మీయుత్తరీయము పడినచోటినుండి రథమిప్పుడు యోజనము దాఁటివచ్చినది.

ఋతు:- ఎట్లు? మాట చెప్పునంతలోనె రథము యోజన దూరము వచ్చెనా?

వార్ష్ణే:- అది నిజమే. మనమిప్పుడు విదర్భదేశము సమీపించితిమి.

బాహు:- అగును. ఇఁక రథవేగము తగ్గింతును.

ఋతు:- [ ఆశ్చర్యముతో ] విదర్భదేశ మిక్కడనే యున్నదా? ఇంతలోనె వచ్చెనా? నెమ్మదిగాఁ జూడవలయు.

బాహు:- రథవేగము తగ్గించితిని. బాగుగఁ జూడుఁడు. [ అని రథవేగము తగ్గించినటు లభినయించును. ]

ఋతు:- (అన్నివైపులఁ జూచుచు సంతసముతోను, నూఅటతోను) సారథీ! బాగుగా నున్నది.

ఉ. చెట్టిదిగుట్టయిద్ది యిది చేనిది కోనయటంచు రూఢిగాఁ
దట్టుచునుండె బుద్ధి వసుధాస్థలి పర్విడుచున్న దెట్టులో

చట్టన నిల్చియున్నది నిజంబుగ నింతకు మున్ను జూడఁగా
వట్టివె యైనవద్దెసలు వర్తిలె నిప్పుడు వస్తుపూర్ణతన్. 23

(తనలో) ఈ విధమున నమానుషముగా నుపకారము గావించిన యీయనకు బ్రత్యుపకారముగా నొక విద్య నొసంగుదును గాక! (ప్రక్కనున్న తాడిచెట్టును జూపుచు, ప్రకాశముగా) నీవు నిజముగ మానవు లందఱిలోఁ జాల గొప్పవాఁడవే గాన, నీ చెట్టుఁజూడఁగనే యిం దున్నయాకుల సంఖ్యఁ జెప్పఁ గలవా ?

బాహు:- అపని యవాఙ్మనసగోచరమే యని తలంచుచున్నాఁడ ఏలన

చం. అవనితలంబులోని పరమాణుగణం బిఁకమింటిచుక్కల
ర్ణవగతవారిబిందులు శిరంబుననుండిన కేశజాలమున్
రవికిరణాళిఁగల్గు నణురాశినిఁ జెప్ప వలంతిగాఁడె వాఁ
డెవఁడిఁకఁ జెట్టుఁజూచియిట నిన్నియయాకులటంచుఁ జెప్పునో. 24

ఋతు:- ఈచెట్టు దొకకొమ్మ పట్టుకొనుము. అం దెన్ని యాకులు పూవులునుం గలవో నేను చెప్పెదుఁ జూడుము.

బాహు:- (కౌతుకముతో రథముదిగి చెట్టుకొమ్మ విఱిచి) ఆర్య! ఇం దెన్ని యాకులు పూవులు గాయలు బండ్లు గలవో చెప్పుము.

ఋతు:- (చూచి) చెప్పుచున్నాఁడ వినుము. ఆకులు పందొమ్మిది, కాయలు పదునొకండు, ఫలము లైదు, మొగ్గలు తొమ్మిది, పూవులు పదునైదు బాగుగా లెక్కింపుము.

బాహు:- (అన్నియుఁ దాను లెక్కవెట్టుట నభినయించి యాశ్చర్యముతో) ఆర్య! మీకు గణితశాస్త్రమున గల సామర్థ్య మత్యాశ్చర్యకర మయినది. (దగ్గఱకు వచ్చి భక్తి వినయములతో) దేవా! ఇది యెట్లు మనసు దెలిసికొనఁ గలదు.

ఋతు:-

తే. గీ. వెలయు నిది యక్షహృదయాఖ్య విద్యయొకటి
దీని జపియించు చుండెడి మానవులకు
పాపము విసంబు రోగము వాసిపోవు
మఱియు నాతండు పండితమాన్యుఁ డగును. 25

ఈ విద్యను గూర్చి పురాణముల యం దిట్లు నుడువఁ బడి యున్నది.

మ. హరుఁ డబ్జాక్షుఁడు బ్రహ్మ వాసవుఁడు చండాంశుండికన్ శ్యామలా
వరుఁడున్ శేషుఁడుయాజ్ఞవల్క్యమునియుంబై లాఖ్యుఁడున్ జాలుగా
గురువర్గం బిది నేర్చువారి కెపుడుంగూర్చున్ శుభశ్రేణులన్
జరియించున్ దనుపాసకప్రతతి కిచ్ఛావర్తియై మిత్రియున్. 26

నాకు నుపకారము గావించిన నీకుఁ బ్రత్యుపకారముగాఁ నీ విద్య నొసంగుదును. నీ కిందు నౌత్సుక్యము గలదేని గ్రహింపుము.

బాహు:- (సంతసముతో సమీపించి వంగి దోసిలియొగ్గి) మహాత్మా! అవధానముతో నున్నాడను. (అని చెవి యొగ్గును)

ఋతు:- (ధ్యానముచేసినట్లు నటించి చెవిలో "నిట్లు" అని చెప్పి) సకలమౌ కలికల్మషము నడంచునట్టి విద్యను నీకుపదేశించితిని. నీ వంతరంగముననే మున్మాఱు జపింపుము.

బాహు:- దేవరవారు గురువులు చెప్పినచొప్పున నాచరింతు నని కన్నులు మూసికొని ధ్యానముసేయుట నభినయించును. (అనంతరము నాయకుని శరీరమునుండి వెడలివచ్చి కలి ప్రవేశించును)

బాహు:- (కన్నులు దెఱచి ముందఱఁజూచి)

ఉ. కాకతమోంజనద్విరద ఖంజనభంజన కాలవర్ణుఁడై
భీకరవక్త్రుఁడై మఱి యభేద్యశిలామయసర్వ గాత్రుఁడై

స్వీకృతవైకృతాంగుఁడయి శేఖరితోరుతమాలమాల్యుఁడై
నాకెదురాయె నెవ్వఁడొ యనంతదురాచరితాద్రియో యనఁ .27

మఱియు వీనికాంతి నీలిరసముచే నేల నలుకుచున్నదో, నీలాంబరముచే నాకసము గప్పుచున్నదో యమునాప్రవాహముచే దెసల ముంచుచున్నదో నీలవర్ణముచే రవిబింబమును రంజింపఁ జేయుచున్నదో కానుగ పూవులచేఁ బగఁటి నలంకరించుచున్నదో మఱియుఁ జీఁకటియొద్దనుండి గ్రహింపఁబడియెనో మేఘములచే నర్పింపఁబడియెనో సముద్రమునుండియుఁ బాతాళమునుండియుఁ గొనిరాఁబడియెనో యనునట్లు సకల తేజములను మ్రింగుచున్నది. (అని నెమ్మదిగఁ జూచుచున్నాఁడు.)

కలి:- (భయముతో వడఁకుచు నెదురొగ్గి) దేవ! శరణు శరణు!

శా. నిన్నత్యున్నతపుణ్యుగా నెఱిఁగియుఁ నీశీలముం బాపఁగా
నెన్నో బాములఁబెట్టియుంటిఁ గలినా నేదుర్మదోద్వృత్తి నా

(అని సగము చెప్పఁగా)

బాహు:- రోషముతో అరే మూర్ఖుఁడా! నాకుఁ బ్రాపించిన దుర్దశాలతలకు మూలకందము వైనకలి నీవ యగుదువా? చూడు మిప్పుడ నీకుఁ దగినశిక్ష గావింతును. అని శపించు నిచ్ఛ నభినయించుచు విమర్శించి తనలో వీనిమాట పూర్తి యయినట్లు లేదు. ప్రకాశముగా అరే! మిగిలినది గూడ వెడలఁ గ్రక్కుము.

కలి:-

నా పన్నుండదన్మదమేయ దుర్విషమె గాల్పఁ సాగె

అని చెప్పుచునె నెత్తుఱుఁగ్రక్కుట నభినయించుచు గద్గద స్వరముతోఁ గన్నీరుగార్చుచు వినయముతో

దీనుండనౌ

నన్నత్యంతకృపామతిన్మనుపు దీనత్రాత సంరక్షకా. 28

[అని విషముగ్రక్కుటు నభినయించుచు వడఁకుచుఁ బాదముల మీఁదఁ బడుచున్నాఁడు.]

బాహు:-(దయతోనవ్వి తనలో) వీఁడు తనయంతననె దారికివచ్చెను గాన వీని నింకను శిక్షింపనేల. హతుఁడైనవాని హింసించుట యుచితముగాదు గదా! [ప్రకాశముగా] మూర్ఖా! వచ్చిన దారినె పొమ్ము.

కలి:- [భయదైన్యములతోఁ గన్నీరు గార్చుచు] మహాత్మా! ఆలింపుము.

తే. గీ. నలమహీశ్వర కర్కోట నాగవిభుని
నిన్నుఁదమయంతి ఋతుపర్ణునిఁ దలంచు
వారితను గృహబంధుల వదలిపెట్టి
యేను దూరముగాఁ బోదు నిద్ది నిజము. 29

బాహు:- కలీ! నీవు శత్రుఁడవైనను శరణుజొచ్చితివిగాన రక్షణార్హుఁడవని యభయ మొసంగితిని. నీ విపుడు గావించిన ప్రతినఁ గాపాడికొనుము. ఇచ్చవచ్చినచోఁ బొమ్ము.

కలి:- (హర్షవినయములతో) అనుగ్రహింపఁ బడితిని. నేను తొలఁగి పోవుచున్నాఁడ. కాఁబట్టి

తే. గీ. ఆశ్రితజనావనోన్నమన యాలకింపు
పుష్కరుని గెల్చి విభవంబు బొంది మఱియు
విరహతతరాగ జలధియాఁవెలఁదిఁగూడి
యఖిలవిధసౌఖ్యసముదయ మందఁగలవు. 30

బాహు:- (పశ్చాత్తాపముతో) కలీ! కోపమువలన నే నుడివిన కఱకుమాటనుగూర్చి వేఱువిధముగాఁ దలంపకుము. నీవు పరమేశ్వరుని సంకల్పము బట్టియే యేదైన నాచరింతువు గదా! నా నేరము క్షమింపుము.

తే. గీ. స్వల్పమేని సుకర్మంబు సల్పఁబడిన
నను వగుసుఖానుభవలాభ మందఁజేయు
కాలపురుషుని యంశ మాకలికి నీకు
నంజలి యొనర్చుచుంటిని నాదరింపు. 31

[ ప్రణామము నభినయించును. ]

కలి:- రాజా! సుఖముగాఁ జిరకాలము జీవింపుము. నే నీ తాడిచెట్టు నందుఁ బ్రవేశించుచున్నాఁడ గాన నిది మొదలుకొని యీ చెట్టు జగమున నప్రశస్త మను వాడుక నొందఁగలదు. నీకు శుభము గలుగుత! [ మని చెప్పినట్లు సేయుచుఁ బోవును. ]

బాహు:- [ఆశ్చర్యముతో తనలో] దైవవిలాస మెంతచిత్రము. ఒరులకుఁ దెలియకుండునట్లు వచ్చి భగవానుఁ డగుకలియే సమస్తముఁ జక్కఁబఱిచెను. ఈ కారణముననే కావలయు నాకు శుభశకునములు సంభవించెను. కలి యనుగ్రహముననే తిరిగి సిరులన్నియుఁ బ్రాపింప నగునని తోఁచెడిని. పుష్కరుఁడు తానే మనకిచ్చునే? కానిమ్ము, ఏదైనసరియే. చూచుచుందును గాక! [ప్రకాశముగా] దేవా! మీరు నాకు మహావిద్య నొసఁగి యనుగ్రహించితిరి. ఇఁక నాలసింపనేల. ప్రొద్దు గ్రుంకఁబోవు చున్నది. [ అని రథమెక్కి గుఱ్ఱములం దోలుచున్నాఁడు.]

ఋతు:- సఖుఁడా బాహుకా! ఎదురఁ గన్నులకుఁ జీకట్లు గూర్చుచు నల్లగానున్న దేమి?

బాహు:- దేవరవారికిఁ దెలియదుగాఁ బోలు. ఇది కుండిననగరోపవన ప్రదేశము.

వార్ష్ణే:- లేక మబ్బు గ్రమ్మియుండెనేమో!

ఋతు:- కానిమ్ము. బాహుకా! గుఱ్ఱముల మెల్లగాఁ దోలుము.

బాహు:- దేవా చూడుము. ఇవి యుద్యానములు. ఇటకుఁ దూర్పుగ భీమభూపాలుని సౌధశిఖరము గానవచ్చుచున్నది. (అని వ్రేలితోఁ జూపుచున్నాఁడు.)

ఋతు:- ఈవనములు నందనవనమును మించియున్నవి. (అని నెమ్మదిగాఁ జూచుచున్నాఁడు)

వార్ష్ణే:- దేవ! ఇదియే విదర్భదేశపు రాజధానియగు కుండినపురము.

ఋతు:- (చూచి వితర్కముతోఁ దనలో)

తే. గీ. మానవేశులసందడి కానరాదు
పురమునందునఁ గైసేత పొలుపు లేదు
బాష్పసంపూరితాక్షులు పౌరు లకట
యిది గనుంగొన సందియ మొదవె నాకు. 32

వార్ష్ణే:- [శంకతోఁ దనలో] స్వయంవరము దగ్గఱకు వచ్చినపుడు పుర మిట్లుండునా?

బాహు:- [పురము జూచి తనలో] స్వయంవరమని చెప్పి ఋతుపర్ణుని రప్పించుట మమ్ముఁగలుపుటకే యని తలంచుచున్నాఁడ. విచారపడుపౌరులు గలనగరమే స్వయంవరము లేదని చెప్పునటు లున్నది. ఈకారణమువలన రేపు స్వయంవరమను ప్రతికయుఁ గృత్రిమమే యని తోఁచెడిని. ఎద్ది కానున్నదో యదియు కానిమ్ము. భవితవ్యత ప్రబల మైనదిగదా!

తే. గీ. కష్టములు వాసిపోయెను గలియుఁదొలఁగె
మాట నెగ్గించుకొంటిమి మహితముగను
కుండినపురంబు సేరితి కోర్కెఁ గదుర
నింక విధిచేష్ట యెట్లగో యెఱుఁగరాదు.

[ప్రకాశముగా] రాజా! నగరముజూచి మీ రాలోచించుచున్నారేమి? ఇది ద్వితీయస్వయంవరముగదా! అది విచారపూర్వకముగానే యుండుట సంభావితమే.

ఋతు:- అంతియే యగు. అయినను నా కింతు గొప్ప సందియము గల్గినది.

బాహు:- చూచినమాత్రన సందేహింపవలదు. పురములోఁ బ్రవేశించినమీఁద నంతయుఁ దెలియఁగలదు.

[పోవుదము అని అందఱుఁ బోవుదురు]

ఇది భారద్వాజసగోత్ర శ్రీజ్వాలాంబికా ఘోరనాథా
రాధ్యపుత్ర బుధజనవిధేయ నాగలింగాభిధేయ
కృతి విశేషమగు నలప్రవాసమునందు
మిషయను సప్తమాంకము.

---

శ్రీ

శివాభ్యాంనమః

# నలప్రవాసము

## అష్టమాంకము

( పిమ్మట నాస్థానమండపమునందు భీముఁడు, ఋతుపర్ణునితోఁ ప్రవేశించును )

ఋతు:- ( చింతతోఁ దనలో ) ఇప్పుడేమని బదులు చెప్పుదును. స్వయంవరకార్యము గలదేని నతఁడేల ఖేదముతో నుండును? భీముఁడే లేఖ వ్రాసియుండెనేని నేమికార్యమునకై వచ్చితిరని నన్నేల యడుగును? ఏను స్వయంవరమునకై వచ్చితి ననుట యసంగతముగఁ దోఁచుచున్నది. యథార్థము సెప్పుట లజ్జాకరంబేగాక యధర్మపరతనుగూడ వ్యక్తము గావించును. అసత్యము పల్కుటయు నయుక్తమే. బదులు సెప్పకుంటయు ననుచితమే. ఏదేని నెపము పన్ని చెప్పుట యాప్తతకు హాని కరము. ఐన నేదో చెప్పుదునుగాక! అదృష్ట మెట్లున్నదో? ( ప్రకాశముగా ) మిత్రుఁడా! మీ దేశ మెటు లున్నదో చూచు కుతుకముతో నిటకువచ్చితిని. కాని మీ వృత్తాంత మంతయు విచారకరముగా నున్నది. సంసారమే దుఃఖ మయము. సాగరమువోలె దాఁట నలవికాదుగదా! ( అని యనుశోచనము గావించును. )

భీము:- ( కన్నీరుగార్చుచు గద్గదస్వరముతో ) సఖుఁడా! భీముని జన్మము దుఃఖ మనుభవింపనే గలిగెను. మహానుభావుఁడ వగు నీవును నాసన్నిధివలనఁ బరితాప మొందుచుంటివిగదా!

ఈయభాగ్యనుద్దేశించి మీరు విచారపడకుఁడు. ఎందేని విశ్రమింపుఁడు. (అని లేవఁబోవును)

ఋతు:– (సంతసముతోఁ దనలో) చెలికారమునకుఁ దగని యీతని సంభాషణ మటుండుఁగాక! నన్ను విచారము గలుగనట్లు వదలిపెట్టినదానికి నిప్పుడు సంతసింపవలయు. నిజముగా నితఁడు సంభాషింపకుండుట దుఃఖపారవశ్యముచేత నేగదా! (ప్రకాశముగా) సఖుఁడా! కానిమ్ము. ఎటనేని విశ్రమించి పిమ్మట దర్శింపఁగలను. అనుమతింపుము.

భీముఁడు:– (గద్గదస్వరముతో) వాకిట నెవఁడు?

భద్రుఁడు:– (భయముతోఁ ద్వరగావచ్చి వినయముతో) పని యానతిండు.

భీముఁడు:– నీవు వీరినిఁగూడ తీసికొనిపోయి యన్ని విధములగు నుపకరణములు గలవిడిదియందుఁ బ్రవేశపెట్టుము.

భద్రుఁడు:– దేవరయాజ్ఞ. (అని పోవును)

ఋతు:– మిత్రుఁడా! పోవుచున్నాఁడ. (అని భద్రునితోఁ బోవును)

భీముఁడు:– (వేడినిట్టూర్పు విడిచి)

చం. పలుకను మిత్రులంగలియఁ బండుకొనన్ జనులంగనుంగొనన్
నిలువనుఁబోవ నేయెడకు నెమ్మదిఁదోఁచ దిఁకేమి సల్పుదున్
గలఁగనుచుంటినో నిదురఁగంటినో మైకము గ్రమ్మి యుంటినో
మెలఁకువ నుంటినో యెఱుఁగ మిత్రులు నా కెఱిగించు సంతసన్

ఉ. ఏపగిదిన్ నివర్తిలక హెచ్చుఁదనంబె వహించుచున్న సం
తాపము కమ్మునిప్పుకవిధంబునఁ గాల్చుచుఁ గన్నుదోయి బా
ష్పాపగ వెల్వరించెడిని నాపగరానియటుల్విషాదముం
బాపునుపాయ మేర్పడదు ప్రాణవియోగముకంటెఁ జూడఁగన్.2

మ. ఒకచో నార్తనినాదనిర్భరిత ముష్ణోచ్ఛ్వాస మింకొక్కచో
నొకచో నమ్రముఖాబ్జపంక్తి యొకచో నూర్ధ్వోచ్చలత్పాణియై

యకటా ము న్నఖిలోత్సవోల్లసితమా నభ్యంతరంబిప్డు నా
రకలోకోదర మిద్దియా ననెడి విభ్రాంతిన్మదిన్ గూర్చెడిన్. 3

ఇదియే యభ్యంతరము. లోనఁ బ్రవేశింతును గాక. (అని పోవుచుఁజూచి దుఃఖముతో) అబ్బా! ఇచ్చటఁ గన్నీరు గార్చుచుఁ దల్లికి నేమోవిన్నవించుచు సౌరకరగృహీతయగు ప్రతిపచ్చంద్రకళవోలెఁ గేశిని కరపంజరమున నున్నమెయిఁ దీవతో నిఖిలలోక విషాదవల్లికి మూలపాళియై కనినమాత్రన సమ్మదము నడంచు నీ దమయంతి యిటనే యున్నది. కాన నిప్పుడు లోని కేగుట దుఃఖకరమే, పోవుదునా? ఉండుదునా? (అని చింతించుచు వాకిటనే నిల్చుండును.)

ఇది శుద్ధవిష్కంభము.

(అనంతరము తల్లితోఁ జెలులతో దమయంతి ప్రవేశించును.)

దమ:- (ధైర్యముతోఁ దల్లి కెదురై కన్నీరు గార్చుచునె) అమ్మా! ఇతఁడార్యపుత్రుఁడే యనుట కేమియు సందియము లేదు. కానిచో మహేంద్రుఁడు వజ్రాయుధముచేఁ గులగిరుల ఱెక్కలు నఱకునప్పుడు వొడము చప్పుడువలెను బాహులేయుఁడు శక్త్యాయుధముచేఁ గ్రౌంచగిరి వ్రక్కలించునదనున నుదయించు నినదము వలెను, వర్షర్తువునందు జలధరము లొండొంటితోఁ దాఁకునప్పుడు గలుగునిధ్వానంబుంబలెను నీ రథనిర్ఘోషం బెట్లు గలుగును? మఱియుఁ బర్ణాదుని వచనము వినఁగనే, యుత్కంఠ నొందికన్నుల నీరొలుకుచుండ గద్గదస్వరముతో బదులు సెప్పె నట. ఇదియునేల సంభవించును? ఇదిగాక యుతుపర్ణుని విడిదికి నాసఖితో బాలురు వోవఁగా వీరలఁజూచి యతిప్రేమతో నెత్తికొని కౌఁగిలించుకొని కన్నీరు విడువ నారంభించి యది యేమని నా సఖి యడుగఁగా మున్ను నాకు నిట్టి బాలు రుండిరని చెప్పి

రోమాంచకంచుకితుం డాయెనట. ఆయనయే కానిచో నా పుత్రప్రేమ యెటు లుండును ? మఱియు నీయన చేతితో నలిపిన పూవులు దొల్లిఁటి చందముననే చక్కఁదనము సౌగంధ్యము గలిగియున్నవట. ఇది యింకొకని కెట్లుసంభవించును? పలుమాట లేల ? ఆయన యందు ననురాగ మొందిన నా డెందమే యాయనయె యార్యపుత్రుఁ డనుటకుఁ బరమ ప్రమాణము. ఇఁక నీయనకుఁ గలిగిన యాకారవికారము నకుఁ గారణమె తెలిసికొనవలయుఁ గాన నిప్పు డాయన నిటకు రప్పింపుము. కా దేని నన్నైన నటకు నునుపుము.

తల్లి :- అమ్మా ! పరితాప మొందకుము. ఆయన నిటకే పిలిపింతును. చూడుము. ఇట నెవ్వఁడును సేవకుఁడు లేఁడాయె. [సని వెడ కుచుఁ బోవును.)

దమ:- సఖీ ! నామాట జననికినిఁ గష్టముగా నున్నది. ఏమి నా బ్రదుకు, (అని శోకించును.)

కేశిని:- సఖీ ! ఇపుడే నైషధు నిటకు రప్పింపఁ గలదు. శోకింపకుము. ( అనంతరము చింతతో బాహుకుఁడు ప్రవేశించును )

బాహు:- (తనలో) విదర్భరాజమహిషి నన్నిపుడు చూడఁ గోరెనట. ఎందులకో?

చం. అరుగుదు నీకురూపమున నంతిపురంబున కిప్పు డేగతిఁ
జిరవిరహార్తిదూన యగుచేడియ నెట్టులు చూడఁజాలుదుఁ
శిరమునువాంచి యెత్తకయ స్త్రీతతిదుల్చెడి పల్వితంబులో
పరుసనిమాట లన్నిఁటినిఁ బల్కకయెట్లు వినంగనోపుదుఁ. 4

(అని మెల్లగా వచ్చుచుండును)

కేశిని:- (చూచి సంతసముతో) సఖీ ! నీ దుఃఖరాత్రి తెల్లవాఱెను. ప్రియుఁ డేతెంచెను. లెమ్మా. ఆయన వచ్చు విధము బాగుగాఁ జూడుము.

దమ:- చెలీ! ఉపహాసమా! కానిచో నార్యపుత్రుఁ డిట్టికురూప ముతో నుండునా? (అని వేఁడినిట్టూర్పు విడుచును)

కేశిని:- సఖీ! దమయంతీ! చూడఁగనే కడచిన విధమంతనుఁ దలఁచి కొని దుఃఖవశమున మహారాజు నిశ్చేష్టితుఁడైనట్లు తోఁచె డినిఁ గాన మనము దగునట్లు సమీపించుదము.

దమ:- సఖీ! ఏనంతకంటెను దుఃఖముచే నిశ్చేష్టితురాలఁ గాన నీవ నన్ను నీకరపంజరమున నిడికొని. ప్రియతముని సన్నిధికిఁ జేర్పుము.

బాహు:- (చూచి కన్నీరుతోఁ దనలో) హా దైవమా! ఇంతనైన నావిషయమున నీదుర్విలాసము ముగియదాయె. కాంతిలేని కాంతయొద్దకు నిట్టినన్నుఁ జేర్చితివిగదా!

ఉ. సిబ్బితి నుజ్జగించి సరసీరుహలోచన నెట్లు గాంచెదన్
గొబ్బున నే నదోషుగతిఁ గోమలిపాలికి నెట్లు వోవుదున్
గుబ్బెత గ్రుచ్చి నన్నడుగఁ గొంకక యేమనిసెప్పుదున్ బదుల్
దబ్బున లేచిపోవె నియతంబుగ నాఁదగు నూర్పు తెమ్మరల్. 5

కేశిని:- (అట్లే తీసికొనిపోయెదను రమ్మని చేయి వట్టుకొని లేవఁదీసి) మహారాజునకు జయమగుగాక! ప్రియురాలిసఖి కేశిని యను దాన. వందనమొనర్చుచుంటిని. ప్రియురాలు దమయంతియు వందనము సేయుచున్నది. చూడుడు. (అని దమయంతినిఁ జూపును)

దమ:- (కన్నీరు గార్చుచు లేచి) ప్రాణప్రియునకును నప్రియము నొన రించుటఁజేసి యెల్లరచే విడువంబడి తలఁచిన మాత్రన దురి తము నిడు నామధేయంబును నిష్ఫలమగు రూపధేయంబును గలిగి హేయయగు దమయంతి యనుదాన. వందనముగావించు చుంటిని.

బాహు:- (చూచి వినియుఁ జింతతోఁ దనలో) ఆరంభమున నే మాటలు సూదులువోలె స్వాంతవజ్రమును భేదించుచున్నవి. నామూలమున మరల హాలాహలోద్భవసమయము రాఁగల దని తలంచెదను. కాన నిప్పు డేమి సేయవలయు? ఎట్లో తప్పు కొనఁగడంగుదును. పరమేశ్వరేచ్ఛ యెట్లున్నదో. (ప్రకాశ ముగా) శుభవతీ! గుజ్జువానిని హేళనము సేయనేల? ఇక్కడ మహారాజెవ్వఁడు? మహారా జిట్లేయుండునా? ఇప్పు డెవఁడు మహారాజుగా నుండెనో మీదండములు వానినేఁ జెందెడిని. (అని తప్పుకొనియుండును)

కేశిని:- (లేచి దోసిలియొగ్గి) మహారాజా! గుర్తులవలన మీరే మహారాజని తెలిసికొంటిమి. మామనవి నాలింపుము. (అని యాచన నభినయించును)

బాహు:- (కోపించినవానివలెఁ దనలో) అంతయు మనకు సంబంధించి నదే. (ప్రకాశముగా) మీరు నన్నుఁదెలిసికొనిన నేమి? తెలిసికొనకున్న నేమి? ఇటకు నన్నేల రావించితిరో యది తెల్పుఁడు.

దమ:- (కన్నీరు విడుచుచు లేచి స్తంభమున నానించిన కరకమలమున మోముదమ్మి నునిచికొని, రెండవచేతితో సఖినిఁ దట్టును)

కేశిని:- మహారాజా! ఆలకింపుము. నా సఖురాలు నా ముఖముతో మహారాజునుగూర్చి కొంచె మిట్లు విన్నవించుచున్నది. ఆ విష యమున ధర్మజ్ఞుల రగు మీరు ధర్మాధర్మవివేచనము గావిం తురుగాక! ఏమనిన మున్ను కుసుంభము మొదలగు ననురాగ ముల నెఱుంగకయు లీలవిలాసము విభ్రమము మొదలగు గాత్రానుభావములు సంపూర్తిగాకయు, నాలాపము, ప్రలా పము, సందేశ మపదేశము నాదిగాగల భాషానుభావముల యందు ననుభవము లేకయు, భావము హావము కాంతి దీప్తి హేల మున్నగు చిత్తజానుభావములఁ బరిశీలింపకయుఁ జెలి

క్షత్రియులతో నాడుటయందుమాత్ర మాదరము గలిగి యభి నవ మగు జవ్వనమున నుండునప్పుడు రాయంచతో సందేశ మంపి యీమత్తకాశిని చిత్తము నాయత్తము సేసికొని పిమ్మట దేవదాస్యము సేయునట్లు నటించి నెమ్మది గలఁత వఱచియుఁ గొనకు నమ్మించి స్వయంవరమున నొక్కఁడీ ముద్దియను దనప్రక్కఁ జేర్చికొనియెను. పదంపడి కదలినను గమలిపోవుననియుఁ బలికినను నోరికి వేదన గల్గుననియుఁ దొడవుల దాల్చినను నొడలికి భార మనియుఁ దిలకంబును మోమునకుఁ గళంకమనియు సఖురాండ్రకుఁ గనఁబడుటయు లాఘవ మనియు గోష్ఠిగమనము దృష్టిదోషావహ మనియుఁ గాంతా జనసాధారణము లగు కృత్యంబులయందును ననుమానించుచు మిగులఁ దేలిక యగు సంభోగంబు నమానుపమగు పరిశ్రమ ముగా దలంచుచు మధుకరము మాలతినసుభవించు చంద మున భోగించుచు చేతితోనె తెప్పచేతంబలె గప్పి పాలించుచు శరీరముతో వేఱుగనున్నను హృదయముతో నేక ముగా నున్నట్లు భావించుచు నిమిషమాత్రమైన యిద్దాని వియోగము సహింపమిచే నింకొక్కయెడకుఁ గదలక నెల్లపుడు నీయతివమోహాంధకారమున నె పడి యసదృశ మగు ప్రేమ గనఁబఱచుచు నతిప్రియునివోలెఁ గొంతకాల ముప లాలనము నభినయించి యపత్యద్వయము గలిగించెను. అనంత రము ఆఱిపోవునదనున దీపములకుఁ గాంతి యెక్కు వగునట్లును బడిపోవుసమయమున భ్రమరములకు భ్రమణ మధిక మగు నట్లును లేమిడి రాఁబోవునపుడు ధనికుల కాడంబరము మిక్కుట మగునట్లును నతిస్నేహము వైరమునకు మూల మను లోకో క్తిని నిక్కముగావించుచుఁ బిల్లలతోఁగూడ నిక్కోమలిని ద్యూతకేళీకోలాహలమున నోడుటకు నవకాశము గలిగించి యీయుబలచే నెట్లో యింకొక యెడకుఁ గొనిపోఁబడి యిల్లు విడిచి యడవినిఁబడి తిరుగుచుఁ గాఱడవిలో నీకోమలి నిదు

రించుచుండ సగము చీరచించుకొని దిక్కులేని యిక్కాంతను నిర్దయుండై వదలిపెట్టి యెటకో పాఱిపోయెను. ఇప్పని విశ్వాసఘాతుక మను గొప్పపాతకము గాదా! దీనివలన ధర్మమార్గమునకుఁ బ్రమాదము లేదని తేటపఱుపుడు.

బాహు:- విని దుఃఖముతోఁ దనలో అడిగినదాని కంతకు బదులు సెప్పక తక్కుదుగదా. (ప్రకాశముగా) ధీమతీ ఎవ్వఁడో యిట్లు సేసెనని వేఱొక్కనిమీఁద నారోపించి చెప్పనేల వినవలసినది వినుము.

ఉ. అంత యథార్థమా దయిత యప్రియ మేమియు జేయనోప దా
వంతయు నకు నేను ప్రియ కాచరియింపనులే దనిష్టముల్
సుంతయు నింతయున్ నియతిచోదితమై యనుభావ్య మయ్యె నీ
యింతకు మూల మాఁగలి తదీహితవృత్తము లీవినోదముల్. 6

ఎవ్వనిచేతనే మాసంపద యంతయు నపహరింపఁ బడియెనో

చ. పుడమి త్యజింపఁగాఁబడియె మూఢతచే నిజకాంత యట్లుగా
నొడలికి రూపు మార్పబడె నుగ్రత మృత్యువుచేతనుంబలెన్
గడుసుదనంబు చర్మమునఁ గల్గె విషాత్తకళంక మట్లుగా
నొడయనివోలె వాఁడు తనయుద్ధతి నంతనుఁ జూపె నీగతిన్. 7

చ. కలి పొడసూపినంతన వికావికమై మహియెల్ల నప్పుడే
తలఁగు విభక్తవర్ణవిహితశ్రుతిధర్మపరాయణత్వముల్
గొలనునఁ జేరి కాఱెనుముగుంపు మదోద్ధతి నీదు లాడఁగాఁ
గలఁగక నీరముల్ నిలువఁగల్గునె నిర్మలమౌ నిజస్థితిన్. 8

ఉ. దేవుఁడు లేఁడనున్ గురుతతిన్ దెగడుం బరలోకమందు స
ద్భావము నుజ్జగించు నిజభావమునం జను వేదశాస్త్రముల్
గావు ప్రమాణముల్ ధనము కామముకంటెను ధర్మమోక్షముల్
లేవను మానవావళి గలిప్రభుఁ డుర్విని గాలు మోపినన్. 9

శా. నీచత్వంబును నుచ్చభావ మెడల౯ నిస్తారతమ్యంబుగా
నాచండాలము గోష్ఠిఁగూడెడి జనం బత్యాదరం బొప్పఁగాఁ
గాచం బే పరమార్థ మాకతన నే కార్యం బకార్యంబగు౯
నీచుండుం బరమోచ్చుఁడక్కరమొగానీ రొక్క మేంజిక్కిన౯. 10

ఉ. అన్నముఁ బున్నము౯ శ్రుతుల హాలము బాలిక విక్రయించుటల్
దున్నలదోయితోఁ బొలము దున్నుట సేవకవృత్తిఁ జొచ్చుటల్
చెన్నగు ధర్మము౯ విడిచి స్వేచ్ఛఁ జరించుట యెల్లవారిదా
నన్నము నారగించుటయు నచ్చుపడు౯ ద్విజలాంఛనంబులై. 11

చ. పలు నెపముల్ ఘటించి నరపాలురు వెంచుచు నింద్రు రాఁబడి౯
వెలయఁగ వంచకావళికి వీలుగ నుండెడి శాసనంబులుం
బలువుగ కీప్సితం బయిన భావమునం బచరించు ధర్మ మీ
యిల నివసించు నెల్లయపు డీతులు నా జచలాస్పదంబులై. 12

సీ. అన్నదమ్ములకును నాలుమగళ్ళకుఁ
దండ్రులకును వారితనయులకును
జనసంచయమునకు జనపాలతతికినిఁ
బోష్యవర్గమునకు బోషకులకు
భిన్నవర్ణులకు విభిన్నమతాళికిఁ
గురువులకును శిష్యకోటి కిట్లు
భిన్నవృత్తులకు విభిన్ననాడికులకు
నేకశాఖీయుల కెల్లరకును

తే. గీ. ప్రజల కన్యోన్య మసహానభావ మొదవఁ
గలహాభోజనుకడుపు చెక్కలుగఁ బగులఁ
గలహకోలాహలోత్సవ కలకలంబు
కలకలలనాడు నాకలికాలమందు. 13

కలికాలవిలాస మిట్లుండు నని యితిహాసములయందు నుడువఁ
బడుచున్నది. ఆకలిపురుషుని చేత నే వ్యాకులత నొందింపఁబడి

యేను సకలదుర్దశల ననుభవించితి. నిందు నేరము లేన్న నేల? ఇఁక నీసఖురాలు ప్రియునకుఁ దనయందుఁ గల ప్రేమాతిశయము బాగుగా నెఱిఁగియు పునస్స్వయంవరమున నింకొక్కని వరింపఁ గావించిన యుద్యమము బాగుగా నున్నది గదా! ఏలన,

చ. పతితుఁడుగాని రక్తివిడి ప్రవ్రజితుం డయి పాసిపోవనీ
మృతుఁడికఁగాని రోగముల మేఁజెడుటన్ వికలత్వ మొందనీ
పతి పరదైవతంబగుట భావిసుఖోదయసక్తచిత్త యా
సతికి వియోగ మామరణసహ్య మవార్యపురోగ మట్లుగాన్. 14

కలిచే నిట్లు బాధింపఁబడినను నాయం దేమియు దోసఁగులేదు. ధర్మము నుల్లంఘించి వేతొక్కని వరింప నిశ్చయించుకొని యున్నవారికి నెదిరిలోపము లెన్నఁ బనియేమి? ఏము వోవుదుము. మీాయిచ్చవచ్చినటుల జరింపుఁడు.

దమ:– (చిఱునగవుతోఁ గేశినిం గాంచును)

కేశిని:– మహారాజా! ఇప్పనికిఁ గలకారణము నవధానముతో నాలింపుము. భయంకరమైన కాఱడవిలో నేమియుఁగనఁబడని సమయమునఁ బ్రియతముఁడు గనఁబడమిచే నాయనఘాతుక చరితము దెలియక ముంజేయి సాఁచి చేరువనేల నంతను దడవుచుఁ గనఁబడమిచే వజ్రముచేఁ గొట్టఁబడినట్లు పడిపోయి కొంతతడ వచ్చేరువుచేఁ గదలకుండి యవ్వల ఆర్యపుత్రా! ఆర్యపుత్రా! అని పలుమఱు మొఱవెట్టుచు బదులుమాట యేమియు వినఁబడమిచే నేలమీాఁదనుండి లేచి చాలకాలము వెదకియుఁ గానక ఆర్యపుత్రా! నేనేమి నేరము సేసితి? ఏల నన్నుఁ గూడ వదలిపెట్టిపోతివి? ఏనేదేని నేరము సేసియున్నను వందనము సేయుచున్నాను. వచ్చి రక్షింపుము. అని బిగ్గరగా విలపించుచు వెడలివచ్చుచునే రూపాంతర మొందిన కాల సర్పమువలెను మూర్తీభవించిన దురదృష్టమువలెను జగము

నంతను మ్రింగనోయన నోరుదెఱచిన మహాసర్పము దగు
కులగిరిగుహాందలపించునోటిలో రక్షింపు మని యేడ్చుచుఁ
బడిపోయెను.

బాహు:- దైన్యముతోఁ గన్నీరు విడుచుచు హా! నాఘాతుకకృత్య
మెంతనింద్య మని సొమ్మసిల్లును.

దమ:- (స్మరణము నభినయించి) అప్పని యిప్పుడగుచున్నట్లున్నది.
ఆసమయ మిప్పుడు వచ్చినట్లున్నది. హా నాథా! ఎటఁబోతివి?
పాము పాము రక్షింపుము. (అనుచు సొమ్మసిల్లి పడిపోవును)

కేశిని:- ఇద్దఱను విసరుచు మహారాజా! దీనికే మూర్ఛనొందెద
వేల? సఖి దమయంతీ! ఇది కథయేకదా. ఊఱడిల్లు మూఱ
డిల్లుము. మహారాజా! తరువాతివృత్తాంతము నాలింపుము.
దమయంతి కింకను నాయువు మిగిలియున్నకారణమున నార్త
నాదము విని బోయవాఁడొక్కఁడు వచ్చి సర్పబాధఁ జూచి
పామును నఱికివైచి యాబాధఁదొలఁగించి యిద్దాని రూపముఁ
జూచియు దిక్కులేనిదని యాలోచించియు నీలతాంగిని వశము
సేసికొన నుద్యమించెను. అపుడు వాఁడిది చెప్పిన మంచి
మాటలు వినక దురుద్యమయుతుఁ డగుటంజేసి కోపించిన
యీనాతిచే శపింపఁబడి బూదియై పోయెను.

బాహు:- (దయతో) వానిదుర్మతి యెంతహేయము? ప్రాణదానము
గావించినవాఁడే కృతఘ్నయగుదానిచేతనే భస్మీకరింపఁబడియెఁ
గదా.

దమ:- నిందతో నే నన్నివిధములను పాపాత్ముఁరాలనే గదా. (అని
నిట్టూర్పు విడుచుచుండును.)

కేశిని:- అనంతర మెట్లో యడియాసచేఁ బ్రాణము బిగఁబట్టుకొని
యిటునటు వెదకుచు దారిలో మునివరుల కాలియడుగులుగని
యవి నాథునివేమో యని కన్నులకద్దుకొనుచుఁ బ్రియుని ముఖ

మును చంద్రబింబమునందును, కనుబొమలను భృంగమాలిక లందును, కనుఁగవను కమలములయందును, పలువరుస మల్లె మొగ్గలయందును, నూరువుల నేనుఁగు తొండముల యందును నడక గజగమనమునందును భావించుచుఁ గన్నీరు కార్చుచు వేఁడినిట్టూర్పులు విడుచుచు నేమేమియో తలంచుచు నడి దారిలో సొమ్మసిల్లుచుఁ దాన చాలకాలమునకు నూఱడిల్లుచు నాథుఁడుకల్గియు ననాథవలెఁ దిరుగుచు సమీపమునఁ జరించుచుఁ గన్నులనీరుగార్చుచుఁ బూరిమెసవను మఱచి దీనాలాపము లాలించి పరవశములైన మృగములచేతను పుట్టలనుండి వెడలి పడగ లెత్తుకొని ఫణామణులు వెలుఁగుచుండ దీనస్వరము నాలింప నంతరాయ మనునూహతో నూర్పులు విడువను మఱచి సమాహితచిత్తములవలె నిశ్చలము లైనక్రూర సర్పములచేఁగూడ ననుశోకింపఁ బడునట్లు వర్తించుచుఁ గంటక వృక్షములచే దిక్కులేనిదని తలఁచి బలాత్కారమున లాగుట కొప్పు పట్టుకొనుట వసనముఁ జింపుట, గాత్రమునఁ గంట్లుగలిగించుట మొదలగు విటవిలసితములు గావింపఁబడుచు నీపె నాకు సవతిగదా యని తలఁచి పుడమిచేతను గత్తిరాళ్లచేఁ బాదములయందు వేదన గలిగింపఁబడుచుఁ దీవలచేతను నీయది మా చక్కదనము నపహరించె నిప్పుడు దైవవశమున నొంటరిగాఁ జిక్కెగానఁ బగఁదీర్చుకొన నిదిమంచి యదనని తలంచినట్లు గాళ్లుగట్టివైచి పొదలలోఁ బడ ద్రోయఁబడుచు గాడ్పులచేతను బాలురచేతంబలె నిదియున్మత్తురా లనితలంచి హేళనభావముతో గాజురాళ్లు ముండ్లు మున్నను వానితోఁ గొట్టంబడుచు నొడలినిండఁ గాయములు గలిగి పోవుచు నెట్లో యడవి దాటి చేదిపురముసేరి సుబాహుని యంతఃపురమున నివురుగప్పిన నిప్పువలెఁ దన వృత్తాంత మొరులకుఁ దెలియనట్లు సైరంధ్రీవృత్తితో నుండఁగా మే మెట్లో వెదకి తెలిసికొని యిటకుఁ జేర్చితిమి. అది

మొదలుకొని విరహామూల మగు నీకొక్క మలియాతన చూడను చెప్పను వినను గూడ నలవిగాదు. ఇఁక నభిజ్ఞ శేఖరు లగు మహారాజుగారే యూహింతురుగాక. అవ్వల నేము నిర్బంధింపఁగా బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు పర్ణాదునిఁ బ్రార్థించి యనిచి యాయనవలన తన ప్రశ్నవచనములకు బదులుచెప్పినవారు మహారాజుగారే యనియు ఋతుపర్ణనాస్థానము నివాసమనియుఁ దెలిసికొని మిమ్ము రప్పింపనే పునస్స్వయంవరమను లేఖ మా సఖురాలిచేతనే లిఖింపఁబడియె. నీ విధమున నిటకు దేవర రావింపఁబడి గుర్తులచే మహారాజుగారే యని నిశ్చయింపంబడియె. నాకతననే కన్యాంతఃపురమునకు బిలిపింపంబడియె నిందుసకల దేవతలును సాక్షులు. ఇఁక దేవరచిత్తము.

బాహు:- ఇదంతయు నిజమే యయినను పతివ్రత లోకదృష్టిచే నైన నెట్లు పునస్స్వయంవరమని ఋతుపర్ణునకు లేఖ వ్రాయ సాహసించునని నాచిత్తము సంశయాయత్తముగా నున్నది.

కేశిని:- మీరె యిది యాలోచించుఁడు. ఎటనైన దూర దేశమున రేపే స్వయంవరమని ప్రియసఖునకు లేఖవ్రాయుట సంభవించునా? ఇఁక నిట్లేల వ్రాయఁబడియె ననిన మహారాజుగారి సారథ్యకౌశలము తనకు బాగుగాఁ దెలియుఁగాన మిమ్ము రప్పింపనే మా సఖి యిట్లువ్రాసెను. ఇఁక నిందు సందియ మేమి ?

బాహు:- (తనలో) నన్ను రప్పింపనే యిట్లు వ్రాసెనని యేను తలంచినట్లె యేర్పడినది. కాని యడవిలో నేను విడిచిపెట్టినది మొదలుకొని నేఁటిదనుక నీపెశీల మెట్లున్నదో యని నా డెందము సందియముతోనే యున్నది. కాన నిప్పు డేమిసేయుదు? (నని తలవంచుకొని యాలోచించుచుండును)

దమ:- (లేచి దోయిలి పట్టుకొని) సర్వకర్మసాక్షులగు దేవతావర్యులారా! మీతో నొట్టువెట్టుకొనుచున్నాను. నేను నైషధునే

గాక వేఱొక్కనిఁ జిత్తముననైన నేదశయందేనిఁ దలంచితి నేమో నిజము చెప్పుడు.

బాహు:- (తనలో) ఈశపథముచేఁ గర్మసాక్షులయిన దేవత లేమేని బదులు వల్కుదురేమో విందునుగాక! (అని కౌతుకముతోఁ జెవియొగ్గి యుండును)

( తెరలో బిగ్గఱగా )

దంపతులారా! జగత్ప్రాణునిమాట వినుఁడు.

మ. నలభూపాల పతివ్రతాగ్రసర పుణ్యశ్లోక శంకార్హ మే
కలనే నీసతి గానలే దొరుని నిక్కం బీనుడిన్ నమ్ముమీ
కలి దూరంబునఁబోయెఁ బుష్కరుఁడు మీకల్మిన్ సమర్పించు నీ
లలనం గూడి యఖండభూవలయ ముల్లాసంబునన్ బ్రోవుమీ. 15

( తెరలో పుష్పవర్షము మృదంగధ్వనియును)

బాహు:- అశేషజగజ్జీవనుఁడ వగు భగవానుఁడా నీకు నమస్కారము. అనుగ్రహింపబడితిని.

దమ:- అనలసఖుండవగు నోమహాబలా నీవు నిజముగా సకల జగత్ప్రాణుఁడవే యగుదువు.

బాహు:- (గౌరవముతో దోసిలివట్టుకొని)

ఉ. ఏడగుస్కంధభేదముల నెక్కుచుఁ జక్రములన్ సుషుమ్ననా
నాడిని దూరి భూరితరనాదము లీనుచు నూర్ధ్వచక్రమం
దాడుచు నిందుబింబకలితామృతధారల నించుచంద్రమ
శ్చ్యాదుని మూర్తిప్రాణమయి శోభనలాభ కరంబుగావుతన్. 16

కేశిని:- (చిఱునగవుతో) ఇంతనైనఁ గన్నులు పూర్తిగఁ దెఱచి దమయంతినిఁగాంచి యీమెయుత్కంఠ నూహింపుము.

దమ:- మిథ్యానురాగికి విరహోత్కంఠారసికత్వ మెట్లుండు నని యేడ్చును.

బాహు:- [తనలో] ఇప్పుడు బదులు సెప్పుదును. [ప్రకాశముగా] ప్రియా! మాఱురూపముతో నుండుటను విదేశమున వసించుటను నాయత్యంతాయాసము నెఱిఁగినవాఁ డెవ్వండు నిచ్చటలేఁడు. ఇఁకమన మెుండొకళ్ల యెడళ్లు గని యూహింపవలసియే యుండును.

కేశిని:- కడచినదానిం దడవనేల? ఇప్పుడార్యుఁడు ప్రియురాలిచేయి పట్టుకొని యా యనురాగముఁ బ్రకటించుఁగాక.

బాహు.- బాగేకాని యేను తొల్లింటి నిజరూపము దాల్చిన పదంపడియే ప్రియురాలిం బరిగ్రహింతును.

కేశిని:- అప్పని కింకను నాలస్య మెందులకు.

బాహు:- దీనికి నొకయుపకరణ మావశ్యక మయి యున్నది. ఏదన కార్చిచ్చునుండిఁ గావఁబడిన కర్కోటకుఁడు నాకు నజ్ఞాతవాసమునకై మాఱురూపు గలిగించి వస్త్రయుగ్మము నిచ్చెను. అది దాల్పఁగనె నిజరూపము వచ్చును. అశ్వశాలలో నున్న యా వస్త్రయుగ్మము దాల్చి శీఘ్రముగనే యాస్థానమున మిమ్ముఁజూడఁ గలను.

కేశిని:- అట్లే కానిండు. నేను సఖురాలి నలంకరించి యాస్థానమునకుఁ గొనిరాఁగలను.

దమ:- ఇదియు దొల్లింటివలె నీటిలోని వ్రాలుగాదుగదా.

బాహు:- ఇప్పుడు ప్రియురాలిం గనుట కాకతాళీయమే యగు. నిఁక పుష్కరుఁడు సంపద లిచ్చునేని నది యజాకృపాణీయమగును. కానిమ్ము పరమేశ్వరేచ్ఛ యెట్లున్నదో పోవుదము. (అని యందఱును పోవుదురు.)

ఇది భారద్వాజసగోత్ర శ్రీజ్వాలాంబికా ఘోరనాథా
రాధ్యపుత్ర బుధజనవిధేయ నాగలింగాభిధేయ
కృతి విశేషమగు నలప్రవాసము నందు
సమావేశమను అష్టమాంకము.

శ్రీ

శివాభ్యాంనమః

# నలప్రవాసము

## నవమాంకము

(అనంతరము చింతతో పుష్కరుఁడు ప్రవేశించును.)

పుష్క:- [వేఁడినిట్టూర్పు విడిచి] నా కీరాజ్యముతోఁ బనిలేదు. ఏలన.

ఉ. పౌరులు దిట్టుచుండిరి నృపాలురు పోరికిఁ జుట్టుముట్టి రీ
చారులు వల్కరేమి గ్రహచారమొ రాజ్యరమం భరింపగా
నేర నుదారచారుగుణనీరధి యానలచక్రవర్తినే
చేరి తదీయపాదసరసీరుహముల్ శరణంబు సొచ్చెదన్. 1

అది యుచితమే.

ఉ. న్యాయపథాప్తమైన సిరి త్యాగము భోగము నొప్పఁజేయు న
న్యాయపథాప్తమైనయది నాశము నొందెడి నెంచ రిత్తగాఁ
జేయును గాలవర్షణము చెన్నుఁగఁ బైరులఁ బండునట్లుగాఁ
ద్రోయు నకాలవర్ష మిఁకఁదొల్లిటిపంటను గూడ వారిధిన్. 2

కావున నీ విభవము నంతను దిరుగ నలున కర్పించుటయు యుక్తము వేకువను గలలో విభవము నంతను నన్నగారు వశము సేసికొనినట్లు గనఁబడియెను. అద్దానికిఁ దగునట్లు నలుఁడు పురోపవనదుర్గమున విడిసి యిప్పుడు పాచిక లాడుటకై నన్ను రమ్మని కబురంపెను గాన పాదచారి నయ్యే యుపవనము ప్రవేశింతును. [అని యుపవనప్రవేశము నటించు

చున్నాఁడు. అంతట భార్యతో బాలురతో సారథితోను నాయకుఁడును, ఋతుపర్ణునితో భీముఁడును ప్రవేశింతురు.]

భీముఁడు:- సంతసముతో ఇప్పటికి నాడెంద మూఱట నొందినది.

తే. గీ. కలిని విదలించి నీ విప్డు గాంతఁగూడి
గ్రహము విడనాడినంతటఁ గాంతి నొంది
కరము మెఱసెడి నా సుధాకరునివోలె
సకలజనులకుఁ గూర్చితి సమ్మదమును. 3

ఋతు:- భక్తి వినయములతో నాయకునిఁ జూచి దేవా! ఊహింప నలవిగాని వేసమునుబట్టి మోస మొందినడెందము గలవాఁచే మూఢత్వమునఁ బెక్కు నపచారములు గావింపఁ బడియె. ననుగ్రహింపుము.

ఉ. నేరము లన్నిటింబరిగణింపక నన్నుఁ గృపక్షమింపుమీ
వైరివరుం బడావనతుఁశాలనసేయుదు రెందుఁబార్థివుల్
నేరమి నాచరింపఁబడునేరము లోరిమి కాస్పదంబుగా
ధీరులు ధర్మశాస్త్రములఁదెల్పిరి గాదె విచారశీలురై. 4

[అని పాదములమీఁదఁ బడుచున్నాఁడు.]

నాయకుఁడు:- [తొందరఁగా] ఇదియేమి. నలుఁడు దుఃఖసముద్రము దాఁట నీవె యోడవైతివి గదా. [అని చేతులతో లేవఁదీసి.] పెద్ద లాలింతురు గాక. ఏ భూపాలునాస్థానము నాశ్రయించుటంజేసి నావార్త యెవ్వారికినిఁ దెలియమిచే నాకుఁగాలము సుఖంబుగఁ గడచెనో ఏ మహాత్మునకు సారథ్యము గావించుట కలిని భంజించుటకుఁ బరమాయుధం బాయెనో, అట్టి పరమోపకారి నాకపచారము గావించె ననుట యెంత విపరీతము. నిజముగ్గా ఋతుపర్ణుఁడు నలునకుఁ గావించిన సాహాయ్యమునకు నలుఁడే ఋతుపర్ణునకు ఋణపడి యున్నాఁడు.

గావున నమ్మహనీయునకు నాశ్చర్యము గలిగించిన యశ్వ
హృదయవిద్యనర్పించి యెట్లో ఋణవిముక్తుఁడ నగుదునుగాక.

ఋతు:- ( సంతసముతో ) ఇది పరమానుగ్రహమే. అవహితుఁడ
నైతినని వేడుకతో వంగియుండును.

నాయ:- (చెవిలో ఉపదేశించును)

ఋతు:- (గ్రహించి హర్షముతో) శరణాగతులయందు దయగల
దేవునిచే ననుగ్రహింపఁబడితిని.

అందఱు:- కృతజ్ఞశిఖామణీ మంచిపనిచేసితివి అని మెచ్చుకొందురు.

పుష్క:- ( చూచి తనలో ) ఈ పాత్ర తేజ మెంత భయంకరముగా
నున్నది? చిరకాలమునుండి వియోగమునొందిన కాంతతోను
బాలురతోనుగూడి పొడసూపిన యీనలచక్రవర్తి నాయందుఁ
గల లక్ష్మీరసము నాకర్షింపఁ బ్రభతోఁగూడి యుదయించిన
ప్రభాకరుఁడువోలె భాసిల్లుచున్నాడు. ఈయనయొద్దకు నిర్లజ్జ
ముగను నిశ్శంకముగను నెట్లు వోవుదునని మెల్లఁగా సమీ
పించుచుండును.

భీముఁడు:- ( చూచి తిరస్కారభావముతో ) కాలినడకతో వచ్చు
చున్న సకలలోక హృదయరుష్కరుఁడగు నీ పుష్కరునిఁ
జూడుఁడు.

ఉ. అంచకు నాలయం బయిన యబ్జమునం బకముండినన్ విభా
గించునె పాలు నీరు గలిగించునె మోదము చిత్రమౌ గతిన్
బంచమసుస్వరానుగతిఁ బాడఁగ నేర్చునె యాడ నేర్చునే
నించును జేపలం గడుపు నిర్మలనీరములం గలంచెడిన్.

అందఱు:- బుజములు తలలు నెగుర నగుదురు.

పుష్క:- తెలియకుండ మెల్లఁగావచ్చి దేవా! ప్రణామము సేయు
చున్నాఁడనని పాదములమీఁదఁ బడును.

నాయ:- వత్సా! చిరాయువుగమ్ము. ఇపుడు గొంచెము జూదముతోఁ గాలము గడపఁదలంచుచున్నాఁడ. ఇందు నా ప్రియురాలి యాభరణములఁ బణధనముగా నొడ్డెదను.

పుష్క:- అన్నగారి చిత్తము. ఇదియే పలక. నే నెల్లసిరులను పణధనముగా నొడ్డుచున్నాను.

నాయ:- వత్సా! అట్లు గావింపుము. (పాచికలు వైచి) నీ వోడిపోతివి.

పుష్క:- (దైన్యముతో) సంపదలన్నిఁటినిఁ దొల్లింటివలె స్వాధీనము సేసికొందువుగాక. నాకుఁ జక్రవర్తివయిన యన్నగారి చరణములే దిక్కు. (అని జూదపుపలక తీసివైచి పాదములమీఁదఁ బడును.)

నాయ:- (దయతో చేతులెత్తి) నీకు మేలు గల్గుత.

ఉ. తమ్ముఁడ ఖేద మొందకుము దైవవశంబునఁగల్గె నాపదల్
లె మ్మభయంబొసంగితిని లే దిక నీపయి నేరమేమియున్
బొమ్ము త్వదీయరాజ్యమును బొందుము నీ వదిగాక యన్యమా
నిమ్మహి యెల్ల నాయది యథేచ్ఛముగా విహరింపు నీపురిన్. 6

(తెరలో మృదంగధ్వని పుష్పవర్షము గల్గును)

అందఱు:- శరణాగతరక్షకా! బాగుగా నున్నదని మెచ్చుకొందురు.

వార్ష్ణే:- సార్వభౌములరగు మీరు మీకుఁ దగినపని యాచరించితిరి.

ఎట్లన,

చ. అపకృతు లాచరించు ప్రబలారుల కైనఁ గృపార్ద్రబుద్ధితో
నుపకృతి యాచరించుటె మహోత్తమ మాను రసజ్ఞసార్థమై
యపరిమితంబు లైనదశనాగ్రపుగంటుల నొందుచుండియున్
వ్యపగతవృత్తిగాకయ సమర్పణ సేయునుగాదె భోజ్యమున్. 7

( తెరలో పరమసంతోషముతో పౌరులు )

ఉ. ఓయవనీమహేశ్వర సముత్కటశోకనిశా వనర్చ్యమా
కాయెను సుప్రభాత మిపు డందఱకోర్కి ఫలించె నేఁటికిన్
బోయెను వీడి మమ్మిపుడు పుష్కరదుష్టపిశాచ పీడయున్
బాయనియీాశుసత్కృప సనాథుల మెల్లర మైతి మింతకున్. 8

నాయ:- మీాకు నాయందుఁగల యనురాగమే యిట్లు పలికించు చున్నది.

( తెరలో )

మంత్రులారా! తనసుకర్మముచేఁ గలిమర్మముల నిర్మథనము గావించినవాఁడును, ధర్మదేవతకు సధర్ముఁడు నగు సార్వభౌముఁడు సుత్రాముఁడు సుధర్మనుంబలె యాస్థానము నలంకరింపఁగలఁ డాయన కిప్పుడు మగుడ నభిషేకము గావింప వలయుఁ గాన నగరము నంతను నలంకరింపఁ దొందర సేయుఁడు.

భగవానుఁడా! నగరమంతయు నలంకరింపఁబడియే యున్నది.

నాయ:- ( విని ) గౌరవముతో మారాకచేఁ బ్రహర్షము నొంది నగరము నలంకరింప మంత్రులకు నాజ్ఞయొసఁగు భగవంతుఁడగు గౌతమహర్షి దగునాజ్ఞ ననుసరించి మంత్రులమాటలును వినఁబడుచున్నవి.

భీముఁడు:- సూతా! రథము సిద్ధము సేయుము.

వార్ష్ణే:- ఏను రథము నలంకరించియే వచ్చితిని.

నాయ:- (దమయంతిని చేతితోఁబట్టుకొని) ప్రియా! రథము నెక్కుదము రమ్ము. ( అందఱును లేచి చుట్టుకొనియుందురు )

పుష్క:- (చేయిఁబట్టుకొని) సార్వభౌము డిటురావలయును. ( అని దారిజూపుచు తీసికొనిపోవును )

నాయ:- (రథము జూచి సంతసముతో) ఎక్కుదము. (అని దమయంతితోఁ పుష్కరునితో భీమునితోను రథము నెక్కుట నభినయించును)

భీముఁడు:- సూతా! గుఱ్ఱములఁ దోలుము.

వార్ష్ణే:- దేవరయాజ్ఞ. పగ్గములు సడలించితిని. (అని రథవేగము నిరూపించుచుండును)

నాయ:- (స్నేహానురాగముల తోఁ దమయంతినిఁ జూచుచు రోమహర్షముతో) ప్రియురాలా! పూర్వమువలె నగరము ప్రవేశించితిమి చూడుము.

చ. వనితలు సౌధభాసురగవాక్షతలంబుల మోము లొప్పఁగా
గనుఁగవఁ బాష్పపూరములు గ్రమ్మఁగ నాపుచు వేడ్కతోఁ జిరం
తనవిరహంబునన్ దెలుపుఁ దాల్చిన నీ మెయిదీవ నెన్నడుం
గననివిధంబుగా నిపుడుగాంచుచునుండిరి చూడు మేర్పడన్. 9

చ. సిరికి నికేతనంబు లగుచేతుల హారతు లొప్పఁగొందఱున్
విరు లరదంబుపై విసరి వేయుచు లాజలతోడఁ గొందఱున్
స్థిరశుభలాభదంబు లగుదీవన లిచ్చుచు నింకగొందఱున్
దరుణు లొసంగు చున్నవివిధం బగుస్వాగత మాదరింపుమీ. 10

దమ:- ఆర్యపుత్రా! నగరము మున్నుచూచినదయిన నిపుడు క్రొత్తదియో యన కౌతుకము వెరిగించుచున్నది.

వార్ష్ణే:- ఆయుష్మంతుఁడా! ఇదియే యాస్థానముగాన రథమునుండి దిగుదురు గాక!

నాయ:- ప్రియా! ఇఁక దిగుదము. (అని దమయంతి చెయ్యిఁబట్టుకొని రథముదిగుట నటించును.

పుష్క:- (దిగి కొంచెము నడిచి) యాస్థానమునఁ బ్రవేశించితిమి. (అని ప్రవేశమును నటించు చున్నాఁడు)

[తెరలో]

(వాద్యధ్వనులు మంగళగానంబును వినఁబడును. అందఱును ప్రవేశించి) శకునములు శుభప్రదములుగా నున్నవి. [యను చుందురు.]

పుష్క:- ఇదియే యాస్థానద్వారము. సార్వభౌములు లోనఁ బ్రవేశింతురుగాక !

నాయ:- ముందఱఁజూచి యాస్థానమండప మిద్దియే (యని లోనంబ్రవేశించును.)

[అనంతరము, పూర్ణకలశములతోను, శిష్యునితోను, గౌతమ మహాముని ప్రవేశించును.]

[తెరలో]

[మంగళవాద్యములు మృదంగధ్వనులు వినఁబడును.]

గౌత:- (సంతసముతో బిగ్గరగా) కలి ప్రభావముం బరాభవించిన సార్వభౌమునకు విజయము గలుగుత! (మని మంత్రాక్షత లొసంగును.)

నాయ:- (బాగుగఁ జూచి) భగవానుఁడా! నమస్కారము. (అని సాష్టాంగప్రణామము గావించును.)

గౌత:- చిరాయుష్మంతుఁడవు గమ్మా. (అని చేతులతో లేవఁదీసి) వత్సా! రమ్మా. చిరకాలవియోగముచే ఖేద మొందినట్లు సంస్కారరహిత మయియున్న యీ సింహాసనము నధిష్ఠింపుము.

నాయ:- (గద్దెయొద్దకుఁబోయి) స్వామీ! కూర్చుందునా? ఇంద్రసేనుని యౌవరాజ్యమున నభిషేకింపుఁడు.

గాత:- (సంతసముతో) నేను తలంచినట్లే సార్వభౌముఁడును నుడివెను. ఏను మీ యిరువుర యభిషేకమునకై సకలతీర్థములతో నిండిన కలశముల రెంటెని గొనివచ్చితిని.

(నాయకుఁడు కుమారుని చేయిఁబట్టుకొని కొమరితతోఁగూడిన దమయంతితోఁగూడ సింహాసనమునఁ గూర్చుండును.)

(తెరలో శంఖ ధ్వని)

(అందఱు గూర్చుండుట నటించుచుఁ జుట్టుకొని యుందురు.)

గాత:- [నిలుచుండి కలశము చేతులతోఁ బట్టుకొని సభకు నభిముఖుఁడై] ఇప్పుడు నేను

మ. కలిసంగంబున నంటుకల్మషము నే గా కన్య సేవాసమా
కలితంబా నపకీర్తియై తవకళంకం బిప్డు ప్రక్షాళనన్
దొలఁగన్ జేయ నన్ సమస్తతటినీతోయాభిసంసిక్తగా
నలు సాపత్యు నొనర్తు నొప్పు డిది సానందంబుగా నందఱున్. 11

(అందఱును) మహర్షివర్యా! బాగుగా నభిషేకింపుఁడు.

గాత:- (కన్నులు మూసికొని ధ్యానము సేయుట నటించి.)

శా. చండాంశూదరసీమనుండి యతనిన్ శాసించు నెవ్వాఁడు బ్ర
హ్మాండశ్రేణికిఁ గారణం బెవఁడు దండ్యాదండనోద్దండ మా
కాండం బెవ్వని కండజాంకుఁడు నిషంగంబబ్ధి యాచంద్రమః
ఖండామండితమౌళి మీ కిడుత సాకల్యంపుకల్యాణమున్. 12

(తెరలో శంఖధ్వని)

గాత:- సార్వభౌమునకు నభిషేకము బాగుగా నెఱవేఱినది.

(అందఱును) సార్వభౌమునకు, యువరాజునకును, విజయము గల్గుఁగాక. (అనుచున్నారు)

తెరలో

(పౌరులు ఓ యవనీ మహేశ్వర...అను పద్యము మరల చదువుదురు)

నాయ:- ఏమి! పౌరులకు నాయందుఁ గల యనురాగము.

గాత:- జను లాలింతురుగాక!

తే. గీ. నలుని దమయంతిఁ గర్కోటనాగవిభుని
వరుస ఋతుపర్ణ రాజర్షివర్యుఁ దలపఁ
దూలజాలంబు సురగాలిఁ దూలునట్లు
గలివలనఁ గల్గు నిడుమలు దొలఁగు నిజము. 13

రాజా! నీకిఁకఁ గావలసిన దేమి యున్నది.

నాయ:- ఇఁక నేమియు లేదు.

మ. చ్యుతి ధర్మంబునఁ గాంచనైతి గలి యెన్నో యేండ్లు గాటించినన్
సతితో యోగము గంటిఁ గాఱడవి నుత్సర్జించినన్ గ్రమ్మఱన్
సుతు రాజ్యంబున నిల్పఁగంటి నతినైష్ఠుర్యంబునం బాసినన్
గృతకృత్యుండ గొఱంతలేదు గరళగ్రీవానుకంపోన్నతిన్. 14

అయినను భరతవాక్య మిదియుండుఁగాక!

చ. ప్రజలను స్వీయులంబలె నృపాలుర ప్రోతురుగాక సన్మతిన్
వృజిననికేతనం బయిన వేరిమిఁ ద్రోతురుగాక మానవుల్
రజతమహీధరాలయుఁదిరంబుగఁ గొల్తురుగాక యెల్లరున్
విజయము గల్గుఁగాత బలభిన్నుత భారతమాత కెప్పుడున్. 15

అందఱును:- అట్లయగుఁగాక!

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది భారద్వాజసగోత్ర శ్రీజ్వాలాంబికా ఘోరనాథా
రాధ్యపుత్ర బుధజనవిధేయ నాగలింగాభిధేయ
కృతి విశేషమగు నలప్రవాసము నందు
పట్టాభిషేకమను నవమాంకము

సంపూర్ణము

శివము.

Janakiram Press, Tenali, Q. 38. -12-46. C. 1000.